నిరువురు కుమారులు కలరు. వీరిరువురిలో పెద్దవారైన తిమ్మరాజుగారు తండ్రిగారు కాలముచేసినవెనుక ప్రజాపరిపాలనాభారమును వహించిరి. వీరు క్రీ. శ. ౧౬౧౦ లో జననమొంది రాజ్యమునకు వచ్చునప్పటికి ముప్పదియొక్కవర్షముల ప్రాయముగలవారై యుండిరి. ఈయన యమితశౌర్యపరాక్రమవంతులై గొప్పగొప్పరాజులను జయించి మించినవారగుటచే ఈయన సార్వభౌమతిమ్మరాజుగారనియు, యీయనయొక్క ధర్మకార్యతత్పరతచేతను, చేకొన్నజయములచేతను కీర్తితిమ్మరాజుగారనియు ప్రఖ్యాతిగాంచిరి. ఈకీర్తితిమ్మరాజుగారి విజయములనుగూర్చి లక్ష్మణకవి తన రామవిలాసములో నిట్లని వర్ణించియున్నాడు.

"సీ. రాజులుమెచ్చఁ బర్లాకోట సాధించి
నరహరిదేవు దుర్నయమడంచె
గుదురైనబావిణికోటలగ్గలువట్టి
యోడుకోటంతయు నుర్వఁగలిపెఁ
దుగరాజుమొదలైన దొరలను భంగించి
విశ్వంభరుని యుద్ధవిరతుఁ జేసెఁ
దగఁ బూసపాటి సీతారామభూపాలుఁ
డభినుతింపఁగ విజయంబుగాంచె
సరసమతుయవనాధీశుఁ దురగపతిని
గయ్యమునఁ గెల్చి లోకవిఖ్యాతిఁ జెందె
వత్సవాయాన్వయమునకు వన్నెదెచ్చె
రాయనృపాలు శ్రీతిమ్మరాజమౌళి"

ఈ సంపుటము నందలి మొదటిపాదమున జెప్పబడిన పర్లాకోట* యనునది గంజాముజిల్లాలోని పర్లాకిమిడి కోట యేమోయని తోచుచున్నది. ప్రస్తుతమున గంజాంజిల్లాలో పర్లాకిమిడి, పెద్దకిమిడి, చిన్నకిమిడియను మూడుసంస్థానములు కలవు. ఈ భాగములు ఆ నామములబట్టిచూడ కిమిడియను నొక పెద్ద సంస్థాన మొకటియై మూడుభాగములుగ విభాగింపబడి నట్లు తెలియగలదు. ఈకిమిడిజమీందారులు తామతి పురాతనమైన ఒరిస్సా కేసరి రాజవంశమునకు సంబంధించి నట్లు చెప్పుకొనుచున్నారు. ఈ పర్లాకిమిడికోటయే పర్లాకోట యని చెప్పినను పర్లాకిమిడిని పాలించిన భూపాలురలో నరసింహదేవు డున్నట్లెచ్చటను గానరాదు. అప్పుడు పర్లాకిమిడి సంస్థానమును పాలించుచు, ముమ్మడితిమ్మరాజుగారికి సమకాలికులైనవారు ముకుందరుద్రనారాయణదేవుడు, ముకుందదేవుడు, అనంతపద్మనాభ నారాయణదేవుడు అను వీరుమువ్వురు కలరు. వీరిలో ముకుందరుద్రనారాయణదేవుడు క్రీ. శ. ౧౬౩౦ మొదలు ౧౬౫౬ వఱకును, ముకుందదేవుడు ౧౬౫౬ మొదలు ౧౬౭౮ వఱకును, అనంత పద్మనాభనారాయణ దేవుడు ౧౬౭౮ మొదలు ౧౬౯౬ వఱకును బరిపాలించెను. శ్రీతిమ్మరాజుగారు ౧౬౯౭ వఱకు బరిపాలించినవా రగుట చేత అనంతపద్మనాభనారాయణదేవుని యనంతరము రాజ్యమునకు వచ్చిన సర్వజ్ఞజగన్నాధ నారాయణదేవుడు కూడ సమకాలికుడనియే నుడువవచ్చును. కాని వీరి నలువురిలో

*Sewel's lists of antiquities of Madras, Vol II. P. P. 185.

నెవ్వరును నరహరి దేవనామధారులై నట్లుకనిపించదు. ఒక వేళ నీపర్లాకిమిడికోటయే పర్లాకోటయని సిద్ధాంతమేర్పడిన యెడల నరహరి దేవుడను నామాంతర మీాపైన వచించిన నలువురు పరిపాలకులలో నెవ్వరికో యొకరికుండవలయును. ఈవిషయమునుగురించి యింతకెక్కుడుగ జర్చింప నాధారాభావముచే వీలు లేకపోయినది.

పై పద్యచతుర్థచరణమున బేర్కొనబడిన పూసపాటి సీతారామరావుగారినిగూర్చి యొకింతచెప్పుట కాధారములు కలవు గాన ఆయనను గురించి యీాక్రింద జెప్పబోవుచున్నారము. ఈపూసపాటివారిని గూర్చి రాయబహాదూరు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు తమ "ఆంధ్రకవుల చరిత్ర" యందిట్లు వ్రాసియున్నారు.

"ఓరుగంటియందుండిన కాకతీయరాజులు చెప్పుకొనినట్లుగానే యీపూసపాటివారును తాము సూర్యవంశజుండైన మాధవవర్మ సంతతివారమని చెప్పుకొందురు. కొండపల్లి సర్కారులోని పూసపాడను గ్రామనివాసముచేత వీరికి పూసపాటివారని యింటిపేరు కలిగినది. ఓరుగంటిసంస్థానము ప్రతాపరుద్రునితో నశించిన పిమ్మట వత్సవాయవారుపూసపాటివారు మొదలైనవారు మహమ్మదీయులకు లోబడిరి. రఘునాథరాజను మారుపేరుగల పూసపాటితమ్మిరాజుగారు గోలకొండలో సరదారుగానుండి శ్రీకాకుళమునకు వచ్చి శ్రీకాకుళమునకుఫౌజు దారుగా నుండిన షేర్ మహమ్మదు

ఖాన్ వలన ౧౬౫౨వ సంవత్సరమున కూలిమి భోగాపురము తాలూకాలను గుత్తకుపుచ్చుకొని పాలనముచేయ నారంభించెను. ఈయనపుత్రుడైన సీతారామచంద్రరాజుగారు మఱికొన్ని తాలూకాలనుగూడ కవులునకు బుచ్చుకొని పర్లాకిమిడి సంస్థానాధిపతియయిన గజపతిదేవుతో మైత్రి సంపాదించి ౧౨౫ గుఱ్ఱపురౌతులతోను ౪౫౦ కాల్బలముతోను పొట్నూరుజయించి కళింగరాజని పేరువడసి యాయూరు నివాస మేర్పఱచుకొని ప్రబలుడయియుండెను.”

“ఈ సీతారామచంద్రరాజుగారు గొప్ప పరాక్రమవంతులనియు, రాజనీతి విశారదులనియు తెలియుచున్నది. వీరే మన తిమ్మరాజుగారి సమకాలికులు. ఈయన మెచ్చుకొనునట్లుగనే తిమ్మరాజుగారు విజయము గాంచిరని లక్ష్మణకవి వర్ణించి యున్నాడు.

పూసపాటి తమ్మిరాజుగారెవనినుండి కూలిమి భోగాపురము తాలూకాలను కవులునకు దీసికొనిరో యట్టి శ్రీకాకుళపు పౌజుదారుడైన షేర్ మహమ్మదునే లక్ష్మణకవి పై పద్యమున “సరసమతుయవనాధీశుదురగపతిని” అని వర్ణించి యున్నాడు. ఈషేర్ మహమ్మదునుకూడ గయ్యమున గెల్చి విజయలక్ష్మి పరిగ్రహణ మొనరించినవాడగుటచే శ్రీతిమ్మసార్వభౌముడు శ్రీకాకుళమువఱకు నుండు దేశమును దన దోర్వీర్యముచే నార్జించెనని నిస్సంశయముగ వక్కాణింపవచ్చును.

పై పద్యమున జెప్పబడిన తిక్కన ఖాణికోటను గురించి కాని, రామదుకోటనుగురించి కాని, దుగరాజును గురించికాని విశేషాంశములు తెలియుటలేదు. కాని దుగ రాజు శబ్దము విశాఖపట్టణముజిల్లాలోని పాచిపెంట జమీం దారులచే బిరుదనముగ నుపయోగింపబడుచున్నదనియు ఖాణి కోటయు రామదుకోటయు, విశాఖపట్టణము, గంజాము మండ లములలోని వనియు, నవి శిథిలములై యున్నవనియు తెలియు చున్నది. వీని ననుసరించి చూడగా నప్పారావుగారు, పూస పాటివారి ప్రభుత్వ [illegible] గంజాము విశాఖపట్టణమండలములలో [illegible] దుర్గములను జయించి ప్రఖ్యాతి గాంచిరని చెప్పవలసియున్నది.

ఇట్లఖండపరాక్రమవంతులై యనేక [illegible] పెక్కు దుర్గముల నాక్రమించి సా[illegible] ప్రఖ్యాతులైరి సార్వభౌమ శ్రీతిమ్మరాజు [illegible]

ఈయన తాతగారైన మొదటి తిమ్మరాజుగారి [illegible] యొక్క యేలుబడిలో ఆయన పినతల్లి కొడుకైన గణపతి రాజు నారాయణరాజుగారికి చిల్లంగి మొదలగు గ్రామములను గొన్నింటిని 'జమియ్యాతు' క్రింద 'మొకాసా' చేసియుండిరి. నాటినుండియు నారాయణరాజుగారు చిల్లంగిలో మట్టికోట గట్టించి గ్రామములు బందోబస్తు చేసికొని యుండిరి. కాని యీ గణపతి రాజుగారికిని యీ మహారాజుగారికిని సరి పడక విరోధమువచ్చి యంతకంతకు శత్రుత్వము ప్రబల

మయ్యెను. అందుమీద సీతిమ్మరాజుగారు ఈ చిల్లంగికోటను ముట్టడించి, యచటి పరిపాలకులను సాధించి కోటను స్వాధీనముచేసికొని యీ గ్రామములను గిమ్మూరు పరగణాలో గలుపుకొనిరి.

ఇదివఱకు గొంతకాలమునుండియు బెండపూడి ఇసుకపల్లి పరగణాలు మహమ్మదీయ పాలకుల, (సైన్యాధిపతుల) యధీనము క్రిందనుండుచు వచ్చినవి. కాని వానినుండి తమకు దగినంత రాబడి లేనందున వారు వానిని పిఠాపురాధీశుల కంటగట్ట యత్నించిరి. కాని, యీ పరగణాలు పాడులోనున్నవనియు, వానిం జేకొనుట నష్టమునకే కాని లాభమునకు గాదనియు నందువలన నా రెండుపరగణాలను దాము భరించ లేమనియు పిఠాపురపువారు చెప్పగా నా తురుష్కాధికారులు బెండపూడిపరగణాను పిఠాపురపు రావువారికిని, ఇసుకపల్లి పరగణాను పెద్దాపురపు వత్సవాయవారికి దఖలు పఱచినారు. నాటినుండియు ఇసుకపల్లిపరగణా వత్సవాయవారి యధీనము క్రిందకువచ్చెను. పెద్దాపురపుసంస్థానమీ కాలమునందే చాల విరివిజెందెను. సర్వవిధముల నభివృద్ధిగాంచినదగుటచేత, నిదియే దీని కుచ్ఛదశయని యూహింపనగును. ఈ రాజ్యవిస్తారమువలననే శ్రీతిమ్మరాజుగారు సార్వభౌమబిరుదమును వహించినట్లు తలంచవలసియున్నది.

ఈయన యెంతపరాక్రమవంతుడో యంత సత్కార్యదీక్షాసముత్సాహుడు. ఈయనను గురించి లక్ష్మణకవి తన రామవిలాసములో నిట్లభివర్ణించియున్నాడు.

మ. నిధినిక్షేపతటాక దేవగృహము ల్నిర్మించె నుద్యద్దయో
దధియయి దీనులం బ్రోచె షోడశమహాదానంబులుం జేసెనం
బుధిపర్యంతధరిత్రియేలె బుధులన్బోషించె సంపూర్ణ ధ
ర్మధనుండై నుతికెక్కె వత్సవయతిమ్మక్ష్మాపతీంద్రుండిలన్

ఈ తిమ్మరాజుగారు పెద్దాపురమును బరిపాలించు చుండగా పిఠాపురమును తెలుగురాయనింగారి మనుమడును చంద్రారాయనింగారి కొమారుడునగు మాధవరాయనింగారు పరిపాలన సేయుచుండిరి. ఆ మాధవరాయనింగారు తమబంధు వర్గములో జేరిన నారసింహరాయనింగారి కొమార్తెయయిన రమణయ్యగారిని పరిణయము సేసికొనిరి. ఈ పిఠాపురపు రావువారే యింతకు గొంతకాలముక్రిత మీనారసింహరాయ నింగారికి జూపల్లెమురా నిచ్చియుండిరి. శ్రీ పీఠికాపురాధీశు లగు రావువంశీయులకును పెద్దాపురపు వత్సవాయవారికిని మైత్రి యుండినందున నొకానొకప్పుడు నారసింహరాయనింగారు పిఠా పురమునకు బోవుచు పెద్దాపురమువచ్చినందున శ్రీతిమ్మరాజు గారు రమణయ్యగారికని చెప్పి కొన్ని గుఱ్ఱములను ఇంకను నితరబహుమానములను చేసిరి. కాని, యీనారసింహరాయ నింగారు తమ కొమార్తె పిఠాపురమునసుందురనియు, ఆమెకు పసుపుకుంకముక్రింద శాశ్వతముగ జరుగులాగుగ నేదైన నేర్పాటు చేయవలసినదనియు గోరగా, పిఠాపురపువారికిని తమకుగల మైత్రిం బాటించి, అంతవఱకు తమ సంస్థానము

క్రింద జరుగుచున్న చాళుక్యభీమవరము (చామర్లకోటవద్దది) గ్రామమును రమణయ్యగారికి పసుపుకుంకుమ నిమిత్తమిచ్చి వేసినారు. ఈప్రకారము వత్సవాయ తిమ్మరాజుగారమి తోదారసాహసములం గలిగి, చేతికడ్డులేకుండ దానము సేయుచు, దమ వితరణముచే శిబికర్ణులం దలపించుచు వన్నెయు వాసియుం గాంచిరి.

—♦ భాషాభిమానము కవిసన్మానము ♦—

ఈతిమ్మరాజుగారు గూడ తండ్రితాతలవలెనే తాము కూడ భాషాభిమానులై కవీశ్వరులనాదరించి ప్రసిద్ధిజెందిన వారు. రామవిలాసమును రచించిన ఏనుగులక్ష్మణకవితాత గారైన లక్ష్మణకవిగారు ఈయనకాలమునందెయుండి తాము రచియించిన ద్రౌపదీపరిణయప్రబంధము నీయనకంకితము చేసియుండిరి. ఈసంగతియే రామవిలాసములోని యీక్రింది పద్యమువలన దెలియగలదు.

"హరిహరపద్మజాంశభవుండై తగు నేనుగులక్ష్మణార్యుచే
సురుచిరశబ్దభారరసశుంభదలంకృతిమాధురీ మనో
హర మగు ద్రౌపదీపరిణయం బను నుత్తమకావ్యమందెను
స్థిరమగు కీర్తిసొంపెసఁగ దిమ్మనృపాలుఁడు ధర్మపద్ధతిన్"

ఈయేనుఁగు లక్ష్మణకవి సీ ధ్రువచరిత్రమును వేంకటరాజపుత్రుఁడగు జగ్గరాజునకును, తులామాహాత్మ్యమును కస్తురిరంగరాజ పుత్రుఁడగు జగన్నాథరాజునకును, వత్సవాయ కులజులయిన రాజబంధువుల కంకితము చేసెను.

శ్రీతిమ్మరాజుగారు కృతినందిన గ్రంథమేదియుఁ గానముగాని, పైన పేర్కొనబడిన భ్రమరచరిత్ర తమ్మాభ్యుదయాదికృత్య ప్రబంధములుగాని యిప్పు డెక్కడను గానరాకున్నవి.

ఈ తిమ్మరాయరాజుగారి నుద్దేశించి చెప్పబడిన యీక్రింది రెండు చాటువులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సమకూర్పబడిన చాటుపద్యమణిమంజరియందు ప్రకటితములై యున్నవి. ఆపద్యములు లబ్ధదిగ్విజయ యశోనందితమైన యీకీర్తి తిమ్మభూపాలునికి సంబంధించిన వేమో యని తలంచి వాని నీక్రింద పొందుపరచుచున్నారము.

"ఉ. తీరుగ వత్సవాయకుల తిమ్మజగత్పతికీర్తిహార మా,
హారశరద్ద్విజన్మకులిశాయుధ జాతులనుంచె; శౌర్యమా
హారశరద్ద్విజన్మకులిశాయుధ జాతులమించె రూపమా
హారశరద్ద్విజన్మకులిశాయుధ జాతులమించె నిద్ధరన్."

"ఉ. రాజులరాజులోభి, యొక రాజులరాజతిమూర్ఖుఁడష్టది
గ్రాజులరాజుచోరుఁడు, విరాజులరాజొకపక్షి తారకా
రాజులరాజుదోషి, ఫణిరాజులరాజొకవక్రగామి, యీ
రాజులరాజులా సుగుణరాజులరాజవు నీవుగాక, యో
రాజవతంస! వత్సవయ రాజమహీపతి! తిమ్మభూపతీ"

వీరి తమ్ములైన బలభద్రరాజుగారుకూడా భాషాపోష కులై కిరాతార్జునీయమునుకృతినందుటయేగాక తాముకూడ కవులయి శ్రీరామశతకమును రచియించివిఖ్యాతులైరి. ఈసం

గతియే రామవిలాసములోని యీక్రిందిపద్యమువలన వేద్య మగుచున్నది.

"మ. అమితఖ్యాతికిమూలమైనకృతిఁదానందెన్నిరాత్మజ్ఞనీ
యము శ్రీరాముల పేరఁబద్యశతంబారూఢినిర్మించె భో
జమహీజానిగతిఁ బ్రసిద్ధిగనియెన్ సాహిత్య పారజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించెధర్మస్థితిన్."

ఇట్లనేక కవిపుంగవులచే సంస్తుతులందుచు నచ్యుతుం డగు శ్రీకృష్ణునకు బలభద్రునింబోలె, బలభద్రుం డచ్యుతాంశసంభూతులగు తమకు దక్షిణభుజంబుకై వడి ననువర్తించుచుఁ, దమకొక యండగానుండ సార్వభౌమ తిమ్మరాజుగా రుదారసాహసమూర్తులై రణరంగవిజయులై కవిజనాశ్రయులై రసగ్రహణభోజులై ప్రతీతిగాంచి విరాజిల్లిరి.

---

## దే శ స్థి తి.

ఈకాలమునందలి దేశస్థితిని దెలిసికొనుట కొంతవఱకు ముఖ్యావసరము గనుక, దానిని గుఱించి యీక్రింద దెలుప బోవుచున్నారము, * క్రీ. శ. ౧౫౭౧వసంవత్సరమునుండియు రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులుగోలకొండ లోనికుతుబ్ షాహీవంశమునకు స్వాధీనములైనవి. కృష్ణానదికి రక్షిణమునందు ననేకులుహిందూరాజులుకూడ గోలకొండ

* Godavary District manual Mahammaden period.

నబాబులకు సామంతులైరి. రఫత్ ఖానుడు రాజమహేంద్రవరమువద్ద విజయమునొంది రాజమహేంద్రవరపరిపాలునికి సాయమొనరించిన ఖాసింకోట రాజునుకూడ సాధించదలచి యుత్తరదిక్కుగా ప్రయాణమై వెడలెను. కాని మార్గమధ్యమున హిందువుల సైన్యము లాతని నెదిరించుటచే తిరిగి హిందూమహమ్మదీయుల కొక గొప్పయుద్ధము సంభవించెను. ఈయుద్ధమునగూడ హిందువులే పరాజయమునొందుట తటస్థించినది. ఈయుద్ధమైనపిదప నంతగొప్పయుద్ధంబు లేవియు లేకపోవుటచే, యీపైనజెప్పిన రెండు సర్కారులందునుంగల దుర్గములను వశపరచుకొని ఒరిస్సారాజైన విజయనాథదేవుని కూడ నోడించి తనయిష్టమువచ్చిన షరతులనంగీకరించునట్లాతనితో సంధిచేసుకొని యటుపిమ్మట రాజమహేంద్రవరము వచ్చి చేరెను. అందువలన నాటినుండియు బహామనీరాజ్య వినాశన సంక్షోభసమయమున హిందువులచే సంపాదింపబడిన రాజ్యములన్నియు జయింపబడి, మచిలీపట్టణమునుండి ఒరిస్సావఱకునుంగల దేశమంతయు దిరిగి మహమ్మదీయ రాజుల పరిపాలనక్రిందకు వచ్చెను.

కాని యీమధ్యకాలమున, అనగా మహమ్మదు కులీకుతుబ్ షాహ (౧౫౮౧-౧౬౧౧) పరిపాలించుచుండగా ఖాసింకోట రాజు చనిపోవుటచేపండ్రెండేండ్ల వయస్సు గలిగిన యతని కుమారుడైన ముకుందరాజు సింహాసనము

నకువచ్చి గోలకొండ నబాబుల యధికారమును ధిక్కరించి వారికి కప్పము చెల్లించుట మానుకొనెను. అంతటితోఁ జాలక యాతడు మహమ్మదీయ గవర్నరును పట్టుకొని యతనిని బందిఖానాలో ఖైదీగా నుంచ బ్రయత్నించెను. అందువలన నాతని నణచివేయుటకై మీర్ జైనుల్ అబిదీన్ హుసున్ దార్ అను సేనాని పంపబడెను. ఈ మహమ్మదీయ సైన్యాధిపతి కిరుగుపొరుగులనుండు హిందూ రాజులు సహాయముగా నేతెంచిరి. అప్పుడిరువాగులవారికిని రాజమహేంద్రవరము వద్ద నొక మహాయుద్ధము జరిగెను. అందెంతసేపటికిని నేపక్షమువారికిని జయాపజయముల నిర్ణయించ వీలుకాదయ్యెను. దాదాపుగా మహమ్మదీయు లోడిపోయిరి. కాని యింతకు బూర్వమే సేనానాయకత్వమును వహించిన అమీన్ జుమ్లా అమీనుల్ ముల్కు అను నత డాకస్మికముగా నింతవరకు మూలబలముగా నుంచిన యొక గొప్ప యాశ్వికసైన్యముతో హిందూ రాజులం బొదివి వారినోడించి విజయంబునుం గాంచెను. మహమ్మదీయులకు విజయము చేకూరెననుటయే గాని వారి సైన్యమున ధైర్యపరాక్రమముల నెఱపుచు బోరాడిన వీరాతివీరులైన గొప్పవార లనేకులు రణరంగమున నిహతులైరి. ముకుందరాజు ఖాసింకోటకు బారిపోయెను. అక్కడికిని మహమ్మదీయు లతనిని వెంబడించుటచే దుట్టతుదకు దేశమును వదలిపెట్టి యాతడు బంగాళమున దాగొనియెను. ఈ యుద్ధమున నాంధ్రక్షత్రియవీరులు గొప్ప పరాక్రమమును

జూపియున్నారు. మన ఇంగ్లీషువారు ద్వితీయ ప్రపంచసంగ్రామమును జయించినరీతిగ యీ యుద్ధము పరిణమించినదని చెప్పవచ్చును.

ఈ ముకుంద రాజుతో బోరాటమునకు రాజమహేంద్రవరము, ఏలూరులనుండి సైన్యములు తీసికొనిపోబడినప్పుడు కొండలలో నివసించుచు, అప్పుడప్పుడు కొల్లపెట్టుటకు గోదావరీ పల్లపుభూములపై దండెత్తివచ్చుచుండు రెడ్లు, అదియే తగిన సమయమనియెంచి కోయవాండ్ర సహాయమును గసి కొని, ఏలూరు, నిడుదవోలు, బాహార్జల్లీలను, దోచుకొనిరి. ఆయా దేశవాసులు, రక్షణమునకై చుట్టుపట్లనుండు నరణ్యములకు బాఱిపోయిరి. కొంతసైన్యముతో అమీర్ ఖాన్ అనునతడు వారిపైకి బంపబడెను. అతడు వారినోడించి తరుమగా వాడుకప్రకారము వారు చెల్లాచెదరైపోయి తిరిగి కొండ గుహలలోను, లోయలలోను, మూగుచువచ్చిరి. ఒకప్పుడిరువదివేలమంది గోదావరీతీరమున మహమ్మదీయుల నెదిరించ నిలచిరనికూడ ప్రజ లనుకొనుటకలదు. కాని, తుట్టతుదకు వారు సంపూర్ణముగ నోడింపబడుటయు, దేశమున శాంతి సంస్థాపనయుం గూడ గలిగెను.

ఏలూరును, గోదావరికి పశ్చిమముననుండు ప్రదేశమునుగూడ సంపూర్తిగ జయింపబడెను. కాని, రాజమహేంద్రవరము మీదను, నదికి ప్రాగ్దిశనున్న ప్రదేశముమీదను మహమ్మదీయుల యధికార మేమాత్రమును భద్రముకాని

స్థితిలో నుండెను. ఆ పరగణాయొక్క విజయము సంపూర్తి యనిపించుకొనజాలదయ్యెను. మధ్యదెల్టాలోని నగరములంక ఇబ్రహీమ్‌షాహాయొక్క సైన్యములచే జయింపబడక మిగిలి యుండెనని తెలియవచ్చుచున్నది. అంతియుగాక పరగణా యొక్క మధ్యభాగమైనను, అప్పుడప్పుడు కొండలలోని యనారోగ్యప్రదేశముల కాత్మరక్షణకై తరుమగొట్టబడుచు వచ్చిన జమీందారుల కొల్లలనుండియు, దోపిడిలనుండియు, రక్షింపబడలేకపోయెను. ఆజమిందారులు తరచు నువ్వెత్తుగ నొక్కసారి దండునుగూడ్చుకొని వచ్చి పైనవర్ణింప బడినట్లుగనే దోచుకొనుచుండిరి. తగినంత మూలబలము లేక పోవుటచే మహమ్మదీయులు వారిని పూర్తిగ నణచిపెట్టుటకు సాధ్యము కాకుండెను.

అయినప్పటికి, ఢిల్లీలోనిపాదుషాలు రాజమహేంద్ర వరముసర్కారును తమ సామ్రాజ్యములోజేర్చుకొని దానిని ఒరిస్సాపరగణాలోనొకకొంతభాగముగ బరిగణించుచువచ్చిరి. బంగాళములోని అక్బరుపాదుషా ప్రతినిధియయిన రాజా మానసింగు, ఒరిస్సాయొక్క యుత్తరభాగమును కొంత జయించిరి. దక్షిణముననున్న సామంతరాజ్యములగు రాజమహేంద్రవరము, శ్రీకాకుళములనుకూడ తాను జయింపకపోయి నను తనవిజయములలో గలుపుకొని వానికి రు 1,25,000లు శిస్తుకట్టెను. ప్రతిసంవత్సరమీసొమ్ము వచ్చునట్లు "అయిని అక్బరీ" అను గ్రంథమున వ్రాయబడి యున్నది. కాని,

యథార్థమునకు మొగలుల యాయుధములు చిలుకసరస్సును దాటిరాలేదని చెప్పవలసియున్నది. ఒరిస్సాలోని యొక భాగమని స్వాదుషాహా లీజిల్లామీఁద నెంత నామమాత్రాధికారము చెలాయించుచు వచ్చినను, నిజమున కదిమాత్రము గోలకొండనబాబులస్వాధీనములో నేయుండెను. వారు తమకువచ్చు రాఁబడి వసూలుచేయుటకై కొంతబలము నచ్చట నిలిపిరి. ఆబలముల పోషణార్థము కొన్ని మాన్యము లియ్యబడెను. ఆమాన్యములకు పన్ను కొట్టివేయబడెను. అట్టిమాన్యముల వలననో, యధమతరగతులవారినుండిబలాత్కారముగ లాగుటవలననో, లేక యన్యాయముగఁ బ్రజలను హింసించి లంచములను బుచ్చుకొనుటచేతనో, యాబలములు తమ జీవనము గడుపుచుండిరి. పొందిక లేని యీపరిపాలనము క్రీ. శ. ౧౫౭౧ మొదలుకొని మన సార్వభౌమతిమ్మరాజుగారి కాలమువఱకు జరుగుచుండెను.

ఈపరిపాలనమిట్లు జరుగుచుండగా క్రీ. శ. ౧౬౭౨ మొదలుకొని ౧౬౮౭ వఱకు అబూహాసేన్ కుతుబ్ షాహా యను నాతఁడు గోలకొండనబాబుగానుండెను. అతడుమిక్కిలి మంచివాడు. "అతడు హిందువులను మహమ్మదీయులను సమానముగ నాదరించుచు సమర్థులైన హిందువులకున్నతోద్యోగముల నొసంగుచుండెను. ఈయనయొక్కమంచితనమునుబట్టియే ప్రజలీయనను తాన్ షాహా లేకమంచిరాజనిపిలుచుచువచ్చిరి. ఈ తాన్ షాహా శబ్దమే రాను రాను తా

నీషాగామారెను." ఈయన కాలముననేయున్న శ్రీరామభక్తుడైన రామదాసు నామాంతరముగల గోపన్నగారిని సంస్మరింపక తీరదు. ఈ తానీషాగారివద్ద నున్నతపదవుల నాక్రమించిన యాంధ్రులలో అక్కన్న మాదన్నయను వారలిరువురు. వీరిద్దఱిలో అక్కన్నగారు సైన్యాధిపతియనియు, మాదన్నగారు మంత్రియనియు, రాయపరాజుగారి పరిపాలనముం గూర్చి వ్రాయునపుడే తెలిసియున్నాడను. ఈ గోలకొండ రాజ్యమును సాధించవలయునని పెక్కురు పెక్కుమారులు ప్రయత్నించియుండిరి. కాని రామలక్ష్మణులవలెనున్న యీ పురుషసింహములను జూచి వెనుకకు తగ్గుచుండిరి. అక్బరు ఫాదుసా మునిమనుమడైన యౌరంగజేబేదో యొక మిషను కల్పించి యీ గోలకొండను బట్టుకొనుట కనేకమారులు ప్రయత్నించెను. కాని భండనగాండీవియని ప్రఖ్యాతివడసిన అక్కన్నగారును, బుద్ధిని బృహస్పతినిమించి యాలోచన కంతటివాడు లేడని పేరుగాంచిన మాదన్నగారును ఔరంగజేబు సైన్యమును కోటగోడలను దరియకుండ దరుమగొట్టుచు వచ్చిరి.

క్రీ. శ. ౧౬౮౭ వ సంవత్సరమున ఔరంగజేబు గోలకొండను తిరిగి ముట్టడించెను. కాని యీ పర్యాయము, ఈ వఱలో హిందువులకు గొప్ప పదవుల నిచ్చుచున్నాడని తానీషాను ద్వేషించినట్టియు, అక్కన్నమాదన్నగార్లకు విరోధులైనట్టియు మహమ్మదీయులు శత్రుపక్షమున జేరిరి. ఈ గోలకొండను ముట్టడింపకపూర్వము శత్రుసేనలు హైద్రాబాదును

ముట్టడించి దానిని జయించినని, అప్పుడచ్చటనున్న తానీషా గోలకొండకు పాఱిపోయి వచ్చి దుర్గద్వారమును మూయించెను. అక్కన్నమాదన్నగారలు హైదరాబాదుపట్టణముననే ముష్కరులగు తురుష్కులచే వధియింపబడినను వారికీర్తి మాత్ర మాంధ్రజాతి యున్నంతకాల ముండితీరును.

తమపక్షము ననున్న మహామ్మదీయులే తన్ను విడచిపెట్టి శత్రుపక్షమున జేరి మోసమొనరించుటచే తానీషా యోడిపోవలసినవా డయ్యెను. అయినను అత డమిత ధైర్యశౌర్యములను జూపుచు నేడుమాసములవఱకు దుర్గమును సంరక్షించుకొనుచు, బోరాడెను. కాని ఔరంగజీబు మాయలముందర నీతని ధైర్యశౌర్యము లేవియు బనికిరాకపోయెను. చిట్టచివరకు ఔరంగజీబు ౧౬౮౭ వ సంవత్సరమున కోటను స్వాధీనపఱచుకొని తానీషాను జెఱబెట్టెను. అనుఱుసటి సంవత్సరముననే గోలకొండ మొగలసామ్రాజ్యములలో జేర్చబడియెను.

నాటినుండియు నీ రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులు కూడ గోలకొండరాజ్యములలోనివే గనుక, మొగలులవశమయ్యెను. ఈ సర్కారులు ఒకరి స్వాధీనము తప్పి మరియొకరి స్వాధీనమైనవన్న మాటయేగాని క్రొత్తపరిపాలనయం దేమాత్రమును మార్పుకనబడదయ్యెను. ఇది వఱకువలెనే యిప్పుడుకూడ హింసాన్యాయములు ప్రబలములయియేయుండుటచే ప్రజలకీ నూతనాధికారుల పరిపాలన క్రొత్తచేయలేదు,

ఈ క్రొత్తగా సంపాదించిన రాజ్యమును బరిపాలించుటకై యౌరంగజీబొక ప్రతినిధిని నియమించెను. ఆ ప్రతినిధికి దక్కనుసుబాదారని పేరు. ఇతడు మొదట ఔరంగబాదులో నివసించి తరువాత హైద్రాబాదును తన ముఖ్యనివాసస్థానముగ జేసికొనియెను. కాలక్రమమున నీదక్కనుసుబాదారుడే హైద్రాబాదు నైజామనుపేర బిలువంబడుచు వచ్చెను. ఈ దక్కనుసుబాదారుక్రింద నిరువదిరెండు సరగణాలుకలవు. వానిలో రాజమహేంద్రవరము శ్రీకాకుళము లనునవి రెండు. ఈ రెండును ఏలూరు, కొండపల్లి, గుంటూరు మొత్తమైదుయుదునుకలిపి యిప్పటికిని "ఉత్తరసర్కారు"లను నామంబున వ్యవహరింపబడుచున్నవి.

ఈ తిమ్మరాజుగారి పరిపాలనాకాలముననే అనగా క్రీ. శ. ౧౬౬౪ వ సంవత్సరమున ఫ్రెంచి తూర్పుఇండియా వర్తకసంఘమేర్పడి యీావలలో వర్తకము చేసికొనుచున్నడచ్చి, ఇంగ్లీషు, పోర్చుగీసువారివలెనే హిందూదేశములో వ్యాపారముచేయుట కారంభించినది. ఈ ఫ్రెంచిదేశీయులనే పరాసువారని పిలుచుదురు. వర్తకవ్యాపారమునకై వచ్చిన యీ పరాసుసంఘమువారు సూరతుపట్టణమున ౧౬౬౮ లో హిందూదేశమున తమ మొదటిగిడ్డంగినికట్టిరి. క్రీ.శ.౧౬౭౨ రవ యేట ఫ్రాన్సిస్‌మార్టిన్ అను నొక పరాసుదేశీయుడు విజాపురవునబాబు నాశ్రయించి, కొంతనేలను సంపాదించి, యచ్చటనే తూర్పుతీరమునందు మొదటి పరాసుస్థానము

నేర్పఱచెను. అదియే పాండిచ్చేరి యని పిలువబడుచు నిప్పటికిని ఫరాసువారిదై యున్నది.

క్రీ. శ. ౧౬౬౧ లో బొంబాయి ఇంగ్లీషు వర్తక సంఘమువారి క్రిందికి వచ్చెను. ౧౬౯౦ వ సంవత్సరమున బంగాళమునందలి [illegible] గ్రామము ప్రదేశ మాంగ్లేయుడైన జాబ్ చార్నాక్ అను వానిచే కొనంగబడెను. ఆ ప్రదేశ మారంభమునుండియే ప్రస్తుతమున్న కలకత్తానగరము కట్టబడినది.

ఈ విధముగ వర్తకవ్యాపారనిమిత్తమై వచ్చిన ఫ్రెంచి, ఇంగ్లీషు, పోర్చుగీసు, డచ్చి వర్తకసంఘములు వీరి నాశ్రయించియు, వారి నెదిరించియు కొంతకొంత భూమి సంపాదించుకొనుచు భారతభూమిలో చక్కగ తమస్థానముల నేర్పఱచుకొనినవి.

గోలకొండ, ఔరంగజేబు సామ్రాజ్యమున జేర్పబడిన సంవత్సరమునందే (౧౬౮౮) ప్రజానురంజకముగ పరిపాలించి, యశఃకీర్తిని సంపాదించిన సార్వభౌమ శ్రీ తిమ్మరాజుగారు తమ డెబ్బదవయేట పరమపదమునొందిరి.

## —♦ రెండవ రాయపరాజుమహారాజులుంగారు ♦—

[ ౧౬౮౮—౧౭౧౮ ]

శ్రీసార్వభౌమ తిమ్మరాజుగారికి సంతానము లేకపోవుటచే ఆయన యనంతరము ఆయనతమ్ముడైన బలభద్రరాజుగారి కొమారులు రాయపరాజుగారు సింహాసనారూఢులైరి. వీరిని ఉద్దండరాయపరాజుగారనికూడ పిలుచుటకలదు. ఈయ

ననుగుఱించి లక్ష్మణకవి తన రామచంద్రవిలాసమునం దిట్లని వర్ణించియున్నాడు.

"చ. శుకకలహంసబర్హిబలసంఘసరస్వతిసింధుబా
హ్లీకముఖదేశసంభవసమిద్ధహయంబుల నోలిఁ దెచ్చి కా
నుకలిడి దేశనాథులు మహాప్రతిభన్ ... శౌర్యగా
రకపుతులయ్యు వత్సవయ రాయన పాదుని గొల్తు రెప్పుడున్

మ. సరసాత్ములన్ నిరతాన్నదానమహిమన్ ... భా
సురపాళీశుభవాక్యవర్ధితగుణస్తోమాన్వయాచార్యబుధ
స్థిరలక్ష్మీపరిపూర్ణరమ్యభవనున్ శ్రీవత్సవాయాన్వయా
భరణున్ రాయపరాజచంద్రుని దగుప్పల్నాడు వర్ణింపగాన్

ఈయన యనివార్యశౌర్యప్రతాపక్రమునవంతుఁడై పద్మనాయకులను జయించినట్లు సైనఁ జెప్పిన రామవిలాసము లోనిదే యగు నీక్రింది పద్యము వెల్లడించుచున్నది.

"గీ. రూపునన కాదు విక్రమాటోపమునను
మాధవుని గెల్చి విఖ్యాతమహిమఁ గాంచెఁ
బద్మనాయకవిజయంబు పదిలపఱచెఁ
దేజమున రాయపక్ష్మాధీశ్వరుండు."

వీరు రాచరికముచేయుచుండగా, క్రీ. శ. ౧౭౦౭ వ సంవత్సరమున మొగలుచక్రవర్తులలో శ్రేష్ఠుడౌ ఔరంగజేబు కాలముచేసెను. ఇతని వెనుక వచ్చిన యితనికుమారులు దుర్బలులైనందున, ఇతని మరణముతోనే మొగలుమహాసామ్రాజ్యము శిథిలమైపోవుట కారంభించినది. ఔరంగజేబు

క్రిందనుద్యోగములలోనుండి గొప్ప రాజకార్యధురంధరులైన తురుష్కులు స్వాతంత్ర్యమును సంపాదించుటకై ప్రయత్నములు సేయఁజొచ్చిరి. అట్టివారిలో దక్కనుసుబాదారుఁడొకఁడు అతని పేరు కమ్రుద్దీన్ అసఫ్‌జా. ఇతఁడు నైజామ్-ఉల్-ముల్క్ అను బిరుదముతో హైదరాబాదును రాజధానిగ జేసికొని దక్షిణదేశమును బరిపాలింపఁజొచ్చెను. ఇతఁడు ఢిల్లీపాదుషాకు పేరునకు మాత్రము ౧౭౨౨ వఱకు సామంతుఁడని చెప్పుచు ౧౩౨౩ లో తాను స్వతంత్రప్రభువైనట్లు ప్రకటించెను. అప్పటినుండియు నదివఱకు మొగలుల వశమునందున్న గోలకొండ సుబా యితని స్వాధీనములోనికి వచ్చెను. ఈతని కాలమున ఆర్కాటు, కర్నూలు, రాజమహేంద్రవరము, శ్రీకాకులము యీగోలకొండ సుబాలోనివిగానుండెను. వీనిని నిజామ్-ఉల్-ముల్క్‌నకు ప్రతినిధులుగానుండిన నవాబులు పరిపాలించుచువచ్చిరి. ఈతని వంశీయులైన హైదరాబాదు పరిపాలకు లిప్పటికి ఈనిజామ్ అను బిరుదముతో బిలువబడుచున్నారు.

దేశమొకరిస్వాధీనమునుండి మరియొకరిస్వాధీనములోనికి బోవుచున్న గందరగోళసమయమునందే మనరెండవ *రాయపరాజుగారు విగతదేహులైరి. ఈయనయొక్క పరిపాలనమును గుఱించియిప్పుడున్నయాధారమునుసరించి యింత

* పెద్దాపురం తాలూకాలో చేరిన రాయిభూపాలపట్నము వీరి పేరుతోనే కట్టఁబడినది.

కన్న నెక్కువగా నేమియుఁ దెలియరాదు. ఇంతకంటె నేమియు విశేషములు తెలియరాకుండుటంబట్టి యీయన రాజ్యమున శాంతి నిలచియుండెనేమోయని యూహించుట కవకాశమిచ్చుచున్నది. ఈగ్రంథమును వ్రాయుటయందుమిక్కిలి సహాయకారియైన మూలగ్రంథమగు రామవిలాసముకాని, నాకు దొరకిన యితరాధారములుకాని, యీయన పరిపాలనమునుగుఱించి వ్రాయుటలో నింతకంటె తోడ్పడవయ్యెను.

శ్రీగోట్టుముక్కలభగవద్రాజుగారి కొమార్తెయయిన రాగమ్మగారు ఈరాయపనృపాలుని సతీమణియై విలసిల్లెను. ఈ యిరువురు పుణ్యదంపతులకు తిమ్మరాజుగారు, బలభద్రరాజుగారు, సూరపరాజుగారు అను మువ్వురు కొమారులు కలిగిరి.

## —♦మూడవ తిమ్మరాజు మహారాజులుంగారు♦—

## [౧౭౧౮—౧౭౩౮]

రెండవరాయపరాజుగారు దేహముచాలించిన వెనుక ఆయన కొమారులలో జ్యేష్ఠులైన తిమ్మరాజుగారు ప్రజాపరిపాలనాభారమును వహించిరి. ఈయన రాజ్యమునకు వచ్చినప్పటి కీయన పదిసంవత్సరముల ప్రాయమువారు. ఈయనకు యుక్తవయస్సు వచ్చునంతవఱకు తల్లిగారైన * రాగమ్మగారే

* పెద్దాపురము తాలూకాలోచేరిన రాగమ్మపేటయు అగ్రామమున కనతిదూరమున నున్న రాగమ్మచెఱువను నొక మహాతటాకమును నీమెవలననే యేర్పఱుపబడినవి.

మంత్రిదండనాథాగ్రణుల సాహాయ్యముతో రాజ్యతంత్రమును నడుపుచుండిరి.

ఇట్లు రాగమ్మగారు కొమారుని సింహాసనమెక్కించి రాజ్య మేలుచుండగా హాజీహుస్సేన్ అను సర్ లష్కరుడు హైదరాబాదునుండి వచ్చెను. రెండవరాయప్పరాజుగారి పరిపాలనలో కుత్రుద్దీన్ అసఫ్ జా స్వతంత్రుడయ్యెనని చెప్పియుంటినిగదా! అతడు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులకు నబాబుగా అన్వరుద్దీనును నియమించెను. ఈ సర్కారులందలి జమీందారులు చెల్లించవలసిన కప్పము బాకీపడియుండ వానిని వసూలుచేయుటకై అన్వరుద్దీను తన తాబేదారైన రుస్తుంఖానును బంపెను. అతడు రాజమహేంద్రవరమును తనప్రధాననివాసస్థానముగ జేసికొనియెను. ఈ రుస్తుంఖానుకే హాజీహుస్సేన్ అను నామాంతరము కలదు. ఇతడు ౧౭౩౨ మొదలు రాజమహేంద్రవరము సర్కారునేడేండ్లుపరిపాలించెను. ఇతడు సైన్యముతో వచ్చుచుండగా నాతని నెటులైన దేశములోనికడుగు పెట్టకుండ చేయవలెనని మొగలతుర్తిసంస్థాన ప్రభువులైన కలిదిండివారి తాలూకు రామరాజుగారును, నూజివీడు సంస్థానీకుల తాలూకు సుబ్బన్న గారును తమసైన్యమునం జేర్చుకొని యుభయులు నొక్కటిగా గూడి రెండుమూడుమారులు అతనిని నేలూరువద్ద నెదిరించిరి. కాని పరాజితులై పెద్దాపురము వచ్చిచేరిరి. దేశాభిమానస్వాతంత్ర్యగౌరవముల నెఱింగిన రాఘవమ్మగారి ప్రోత్సా

హము తిమ్మరాజుగారును, పిఠాపురమును బరిపాలించు చున్న రావు వెంకటకృష్ణారాయనింగారును, వీరికి దోడై నిలిచి యీ హుసేనును గోదావరిని దాటిరాకుండ చేయవలెనని యోచనచేసి బలమును సంసిద్ధముచేసి యుద్ధమునకు సిద్ధపడిరి. ఇంతలో నాసర్ లష్కరుడు గోదావరినదిదాటి రాజమహేంద్రవరమునకు వచ్చెను. అంతట నొకటిగా గూడి వీరందఱి సైన్యములును రెండుసాఱు లాతురుష్క సైన్యాధిపతిని శాలివాహనశకము ౧౬౫౭ వ సంవత్సరమునకు సరియయిన క్రీ. శ. ౧౭౩౫ వ సంవత్సరమున మార్కొనియెను. కాని, దైవము తురుష్కులపాల నుండుటచేత నీ యుద్ధమునగూడ ఉస్తుస్ఖాను నే విజయుడయ్యెను.

వెంకటకృష్ణారాయనింగారు తమకు సన్నిహిత జ్ఞాతియైన రావు బుచ్చన్నగారిని వెంటబెట్టుకొని రామరాజు, సుబ్బన్న గార్ల సహితముగ గొండవాండ్ర సహాయమున బితూరీ రేవు టక్కై తోటపల్లి మన్యమునకు బాఱిపోయిరి. కాని, యచ్చటి కరిగినవారిలో బుచ్చన్నగారు తక్క మిగిలినవారు మన్యపు జ్వరములచే బీడితులై మృత్యువువాతపడిరి.

అటుతరువాత కొంతకాలమునకు సర్ లష్కరుడు పెద్దాపురమునకరిగి పశ్చిమమున నున్న పాండవులవారి మెట్ట యని చెప్పబడుచోట దండువిడిసి తన్నోడింప సైన్యములను సహాయమిచ్చెనుగదా యను కక్షచే రాగమ్మగారికి కపట

ముగ నిట్లని తనకొమారుడైన నూరుద్దీనుహుస్సేనుచే రాయ బారమంపెను. "మీది ప్రాచీనమైన సంస్థానము. మీది ధర్మపరిపాలనము. ధర్మప్రభువులగు మీకొమారుల నొక్క పర్యాయ మిచ్చటకు బంపినచో వారి దర్శనముచేసికొని ధన్యుల మగుదుము. మేముకూడ వారికి సంస్థానమును స్థిర పఱచి వెడలిపోగలము." ఇవ్విధమున తన తనూజుడైన నూరుద్దీన్ హుస్సేనుచే రాయబార మంపగా రుస్తుంఖానుని కపటమెరుంగక, యతని వాక్యములయందు సంపూర్ణవిశ్వాస ముంచి, గౌరవపరివారముగ నిరువురు ముగ్గురు ననుచరులను మాత్రమే తోడిచ్చి రాఘవమ్మగారు తనకొమారులను పరమ సాధువైన మేషాకృతినున్న క్రూరవ్యాఘ్రము దగ్గఱకు, మహాభీలమృత్యుగహ్వరమునకు, యమసదనమునకు సాగ నంపినట్లు సాగనంపెను. ఆమెయొక్క కుమారులుకూడ నూరుద్దీన్ హుస్సేన్ వలెనే హాజీహుస్సేన్ వాక్యమందలి కాపట్యము నెఱుంగక తమ పాలిటి యమాలయమునకు బోయిరి.

అప్పుడా రాజకొమారులను హాజీహుస్సేన్ తన డేరా లోనికి రప్పించి కొంతసేపు సంభాషణ జరిగిన పిదప నూనె కాపించి సలసల మఱుగుచున్న నూనెను జొన్న వెన్నులతో వీపుమీద గొట్టించి దయాదాక్షిణ్య రహితుడై, క్రూర కిరాతస్వభావుడై, రాక్షసప్రవృత్తిని నెఱపి, దారుణహింస పాలు చేసి యసువులం దీసెను.

తానును వారితోఁబాటు యుద్ధమునం బడి తన విశ్వాసమును వెల్లడించెను. అంతట వారెల్లరును నాయగ్నిహోత్రజ్వాలలఁ దమ భార్యాపరివారంబులం జాలించి యుత్తమలోకముం గూర్చి జనిరి. ఇంతటి వీరమును క్షత్రియకాంతారత్నములు చూపిన స్థైర్యసాహసాదులు నిరుపమానములని తెలుపుట కిట్టి యుదాహరణములు మన దేశమందనేకములు గలవు.

ఈ సైన్యమునకు నధిపతియగు రాయపరాజుగారి కొమారుఁడైన రెండవ తిమ్మరాజుగారు ౧౬౧౪ మొదలుకొని యిరువది సంవత్సరంబులు పాలించి క్రీ. శ. ౧౬౩౪ లో విగతజీవుఁడైరి. ఈయన యనేక దేశలిపులను, ననేక దేశభాషలను నేర్చిన విద్వాంసులలోని యీ క్రింది పద్యమువలన దెలియవచ్చుచున్నది.

"మ. ధీరుఁడు సన్మతిన్ బహుదేశలిపుల్ బహుదేశభాషలున్
సారకవిత్వసౌష్టవరసజ్ఞతయున్ దననాత్మబుద్ధిచే
నేరిచె విద్యలన్నిటికి నిత్యవిభూషణమైనయావిచే
భూరియశంబుగాంచె గుణపూజ్యుఁడు తిమ్మనృపాలుఁ
డిమ్మహిన్."

ఈ తిమ్మరాజుగారి మరణముతో క్రీ. శ. ౧౬౬౧ వ సంవత్సరమునకు బూర్వమునుండియు వత్సవాయ వంశీయులచే నవిచ్ఛిన్నముగ బరిపాలింపబడుచు వచ్చుచున్న పెద్దాపురసంస్థానము మహమ్మదీయుల యధికారముక్రిందకు వచ్చెను. ఇక్కడనుంచి యీసంస్థానము క్షీణదశకువచ్చుటకు ప్రారంభించుటయేగాక కొంత కాలము మహమ్మదీయులపాల వశమునున్నది.

## —♦ మహమ్మదీయుల సర్వాధికారము ♦—

[క్రీ. శ. ౧౭౩౮ మొదలు ౧౭౮౯ వఱకు]

రాగమ్మగా రగ్నిప్రవేశ మొనర్చునపుడు, [illegible] యామెదగ్గఱ కొంపెల్ల మహాలక్ష్మి యను నొక బ్రాహ్మణి [illegible] యుండెను. అప్పు డారాగమ్మగారు తమకు కుమారుడు [illegible], తిమ్మరాజుగారి కొమారుడును, పేడాది శిశు[illegible] జగపతి రాజుగారిని విజయనగరమునకుం దీస్కు [illegible] రాజుగారి భార్యయు దన సోదరియగు [illegible] గారి కీ సంగతి యంతయుం జెప్పి యొప్పగింపవలసినదని చెప్పెను. అంతట వితంతువైన నా బ్రాహ్మణి [illegible] ప్రాయుడైన యారాచకొమరుని [illegible] విజయనగరమునకుం గొనిపోవ [illegible] గొంతమంది మహమ్మదీయ భటులామెను ద్వారమువద్ద నడ్డగించి యీరాజపుత్రు నెచ్చటకు దీసికొనిపోవుచున్నావని యడుగ నామె యతడు రాజపుత్రుడు కాడనియు, తన కుమారుడే యనియు బ్రమాణముచేసి చెప్పెను. అటుపిమ్మట నాభటులు సంశయ మనస్కులై యామె వచనంబులను విశ్వసింపజాలక తమ సంకోచముం దీర్చుకొన నొక జామిపండు తెచ్చి యా బాలునకిచ్చి యతనిచే నాఫలమును గొరికించి యాయుచ్ఛిష్ట ఫలము నామెను భుజింపవలసినదని యానతిడిరి. అంతట నామెయు నారాజపుత్రు సంరక్షణమే తన విధాయకకృత్యముగా నెంచి, కులభేదము నెంచకయుం బాటిసేయక, మేత

నెంచి, మృగయుడు మృగములంబలె ప్రజల వఱిమిదఱిమి వేటాడి కసిమసంగుచు, దుర్నిరీక్ష్యతేజుడై రుస్తుంఖానుడు క్రీ. శ. ౧౭౩౨ మొదలు ౧౭౩౯ వఱకు బరిపాలించెను.

* ఈపదునెనిమిదవ శతాబ్దాదినుండియు హైదరాబాదులో నివసించుచున్నట్టియు, రాజకార్యవ్యవహారములకు సంబంధించిన కాగితములను పరీక్షించ గలిగినట్టియు జేమ్సు గ్రాంటు అను ఆతఁడున యీయేడేండ్ల భయంకర పరిపాలన ముంగూర్చి యీయాక్షేపణాగర్భితములగు హాస్యవచనముల నిట్లు వ్రాసియున్నాడు.

"రుస్తుంఖానుయొక్క న్యాయబుద్ధివలనను, భుజబలమువలనను ప్రజలుపొందిన యుపకారము లసంఖ్యేయములు, ఇతడు తనకొసంగబడిన యధికారము నతిసమర్థతతో నెరపి, నాలుగు దక్షిణపరగణాల సహితముగ రాజమహేంద్రవరము నేడేండ్లు పరిపాలించెను. ఈపరగణాలలో నుండెడి జమీందారులు మొగలమహాచక్రవర్తియైన ఔరంగజేబు మరణానంతరమున బుట్టిన సంక్షోభములను, కలతలను దమకు వీలుగా జేసికొని, తనచుట్టుపట్లనున్న మహమ్మదీయనాయకుల యధికారమును ద్రోసిపుచ్చి తాముసాధారణముగా స్వతంత్రులగుటకు బ్రయత్నించుచువచ్చిరి. జమీందారులయొక్క యిట్టిదుండగములను నివారించి, సరియైనపద్ధతులమీద గ్రామపరిపాలనమేర్పరచుట, యీగ్రొత్తజిల్లాదారు (రుస్తుంఖాను)

* Godavary District Manual.

సి, దుష్కరకార్యముగనుండెను. అవసరమునకు దగినపద్ధతి నవలంబించుట, నిదానించి కనికరము చూపుట, పరుషమై సర్వసామాన్యమైనన్యాయమునొసంగుట, వీనికనుకరించదగిన యుదాహరణమని నేటివఱకు ప్రజలచే దలంపబడుచున్న నైజాముగారి యాశయము దోషరహితమైనదని, యీక్రొత్త జిల్లాదారుని నడవడిక స్థిరీకరించెను. ఆకాలమునందే, జమీందారులు పరధనాగారములను మోసముచేసి యపహరించుటచే, వారు పాటుపడుస్వభావముగలకృషికుని, శిల్పకారునింగూడ హింసయును నయోహస్తములతో బిండి పిప్పిచేసిరి గనుక నట్టి నిర్దయాళులైన క్రూరులగు జమీందారులను నిర్మూలము చేయుటయే నస్సుంఖాసుని పరిపాలనయందలి ప్రథమప్రధానవిషయమై యుండెను. ఆతని కరవాలము దారింబడక పాఱిపోయినవారు రాజద్రోహులుగ పరిగణింపబడిరి. అట్లు పాఱిపోయినవారలు వారినంటిపెట్టుకొని యున్న వారినిగూడ తిరిగివచ్చినయెడల బహుమానము లొసంగబడునని ప్రకటింపబడెను. ఇందువలన జాలినంతమంది త్వరలోనే ప్రోగయిరి. వారట్లుపోగయినది భయాశ్చర్యములను గలిగించు "కుల్లామినారుల"ని పిలువబడు రెండుస్మరణచిహ్న శిరోగోపురములనిర్మించుటకే గాని సజీవులై యుండియిహ సౌఖ్యముల ననుభవించుటకుమాత్రము కాదయ్యెను. ఇట్టి కుల్లామీనారులప్పుడు ప్రతిపరగణాయొక్క ముఖ్యపట్టణము వద్దను సామాన్యముగా గానవచ్చుచుండెను. సాధారణముగా

ప్రజలెల్లరు నితనికి భయపడుచు నితడన్న వెఱగుపడుచుండెడు వారు. ఈరుస్తుంఖాను పవిత్రేయులైన యీ జమీందారుల నెల్లరం దొలగించి వారికి బదులుగ అమీనులను నియమించి ప్రసిద్ధి జెందెను. ఈ రుస్తుంఖానుని శిక్షాపరిపాలన యుత్తర సర్కారులలో ప్రశంసనీయమైన పేరువహించియుండెను.

ఈ రుస్తుంఖాని యుగ్రపరిపాలనక్రౌర్యదౌర్జన్యతకై, ప్రళయాంతకుని చందంబున విజృంభించుచుండ నీతని తనయుడు నూరుద్దీన్‌హుస్సేనుఖాను డీ ప్రళయసంహారమును గాంచి సహించలేక బలవంతముగ నాతని మెడమీద డేరా కొయ్యలు వేసి త్రొక్కి చంపించి వానిపాలిటి యమదూత యయ్యెను!

ఈ రుస్తుంఖానుని మరణమును నూరుద్దీన్‌హుస్సేను తన పై యధికారికి దెలిపినమీదట నాతడును అత డొనరించిన కార్యము మంచిదేయని యతనిం గొనియాడి యతనికి రాజమహేంద్రవరమునకే గాక దాడివెడలి జయించినచో కళింగము సర్కారునకు గూడ నధికారమిచ్చితిమని ఫర్మానా నిచ్చెను. అటుపిమ్మట నూరుద్దీన్‌హుస్సేను కళింగమును జయించుటకై దాడి వెడలిపోవుచు, చేబ్రోలు వెళ్లు తరుణమునకు మన తిమ్మరాజుగారి కుమారుడైన జగపతిరాజుగారిని తురుష్కులు చెఱలోనుంచిన సంగతి తెలిసి, పూసపాటి పెదవిజయరామరాజుగారు విజయనగరమునుండి నలువది వేల

ఫౌజును గూర్చుకొనివచ్చి నూరుద్దీన్ హుస్సేను నెదిరించెను. అప్పు డుభయపక్షములవారికిని ఘోరసంగ్రామము జరిగెను. అట్లు మహోగ్రముగ యుద్ధము జరుగుచుండగా విజయరామ రాజుగారి తురుపు అనకాపల్లి గోపాలుని అనెడు ఫౌజు రెండు వేలమంది నూరుద్దీన్ హుస్సేన్ ఖానుడెక్కిన యేనుగ నావరించు బొదివి దానిపై నున్న యంబారీ పట్టుకొని సాహసాన్వితులయి లోకమూల నీటెలును బల్లెములు పుచ్చుకొని పోవుచు చున్నను, గొబ్బరిపుచ్చెలట్లు తలల నరకఁగొట్టుచున్నను వెనుకకు దిరుగక తమ ప్రయత్నముల నుండి మానక, యతి సాహసముతో నంబారీత్రాళ్ళను ద్రెంచివైచి నవాబును బట్టుకొని శిరస్సును ఖండించిరట! ఇదియే నిజమయినచో నాంధ్రుల ధైర్యసాహసములు భూలోకమున శాశ్వతముగ నుండగలవు! అంతట తురకల సైన్యములు కదనరంగమునకు వెన్నిచ్చి తమపిక్కల దారుఢ్యమును జూపినవి. అటుపిమ్మట విజయరామరాజుగారు, జగపతిరాజుగారిని స్వాధీనముచేసి కొని తమ కనుకూలురై సరదారు మొదలగువారికి బహు మానము లొసంగి యాదిన్నవాపని తీసుకొని విజయనగరము వెంటబెట్టుకొని వెళ్ళి తమ యన్నకుమారునివలె ఆనందరాజు గారితో గూడ బెంచుచు సంరక్షించుచుండిరి.

ఇప్పు డీచెఱవిడిపించి తెచ్చిన పెదవిజయరామరాజు గారి భార్యయయిన చంద్రయమ్మగారి కీజగపతిరాజుగారు మేనగోడలి కుమారుడని వేరొకచోట చెప్పబడినది. ఈ పెద

విజయరామరాజుగారు శ్రీ సార్వభౌమ తిమ్మరాజుగారి పరిపాలనమున జెప్పబడిన శ్రీ పూసపాటి సీతారామచంద్రరాజుగారి మనుమఁడు. ఈయన తండ్రిగారైన యానందరాజుగారి యనంతరమున రాజ్యమునకువచ్చి మన్నెదొరలను గెల్చి వారి దేశము నాక్రమించుకొని మన్నెసుల్తాను బిరుదమును వహించిరి. ఈయనయే తమపేరట విజయనగరమును గట్టించి తమ రాజధానిని పొట్నూరునుండి విజయనగరమునకు మార్చుకొనిరి. వీరు ౧౭౧౨ వ సంవత్సరమునకు సరియయిన విజయసంవత్సర విజయదశమీ జయవారమునాడు విజయనగరమున కోట కట్టుటకు శంకుస్థాపనము చేసినట్లు "ఆంధ్ర కవుల చరిత్రము" నుడువుచున్నది.

ఈ పెదవిజయరామరాజుగారి నగరున జగపతిరాజుగారు ఆనందరాజుగారితో బెరుగుచుంటను దెల్పియుంటిమి. కాని యొక్కయింటనే పెరుగుచున్న యీ స్వాతంత్ర్యాభిలాషులగు రాజకొమారుల కిరువురకును పొసగదయ్యెను. వీరిరువురు ప్రతివిద్యయందును నొకరికొకరు మించవలెనని ప్రయత్నించుచుండిరి. ఇరువురునుగూడ దేనియందును నొకరికొకరు తీసిపోయినవారు కారు. బాల్యక్రీడావినోదములయందు సహితము జగపతిరాజుగారొక పక్షమువహించిన ఆనందరాజుగారు వారికెదుటిపక్షము నవలంబించుచు వచ్చిరి. తుదకు కోడిపందెములలో సయితము జగపతిరాజుగా రొకవైపు ఆనందరాజుగా రొకవైపు నుండుచు వచ్చిరట! ఆనందరాజు

గారి కానాటికానాడు వయస్సు వృద్ధియగుచున్నట్లుగనే జగపతిరాజుగారిపై నసూయకూడ నభివృద్ధియగుచుండెను. కాని ఆయనకు నిర్నిమిత్తముగ జగపతిరాజుగారిపై నుదయించిన యసూయాద్వేషము లేహానియుం జేయక యప్పటికిమాత్రము నిష్ప్రయోజనములయ్యెను. వీరిరువురినిగుఱించిన యొక చిన్న యితిహాసముకలదు. అప్పటి యీ క్షత్రియకుమారు లిరువురి మైత్రి సంబంధ మెట్లుండినదియు భావించుటలో నియ్యది కొంతవఱకు దోడ్పడు నేమోయని దాని నీక్రింద పొందు పఱుచుచున్నాడను.

ఒకనాడు విజయనగరముకోటలో గోడిపందెములు జరిగెనట. జగపతిరాజుగారికి జరణాయుధములం బెంచుట యత్యంత ప్రీతికరమైయుండెను. తామంతవఱకు బెంచుచుండిన కుక్కుటమునే జగపతిరాజుగారు పందెము కట్టిరట! ఆనందరాజుగారా సమయమున కొక్క కుక్కుటమును పోటీకి తెచ్చి పందెమునకు వదలిరట! ఇట్లొక కొంతతడవా రెండు పుంజులును పోరాడినపిమ్మట జగపతిరాజుగారి కుక్కుటరాజమే గెలుపుగొనెనట! అంతట ఆనందరాజుగా రోడిపోయినను ఆ విచారమును మోమునం దోపనీయక, యించుక నవ్వుచు బరిహాసవచనముల "బెంపుడికోడియే గెలిచిన"దని జగపతి రాజుగారిని గేలిసేసిరట!

ఈ విధమున నానందరాజుగా రీజగపతిరాజుగారి నసూయానేత్రమున జూచుచు వచ్చినను చంద్రయ్యగా రొకకంటను

విజయరామరాజుగారి కంటను ఆయనంగనిపెట్టుచు నేకొ అంతయుం గలుగకుండ సంరక్షించుచుండిరి.

ఇట్లుండగా పెద్దాపురసంస్థానమును దిరిగినిలువబెట్టుటకై నితాంతప్రయత్నములు జరుగుచుండెను. పెదవిజయరామరాజుగారికార్యమును సాధించుటకై తమ ప్రధానామాత్యులైన బుజ్జాబుచ్చన్నగారితో స్థలమంత్రాంగములు చేసి యుప్పుడమీన్ దారుగనున్న “సీమత్ ఆలీని” మంచిమాటచేసికొని యత డెట్లో సమ్మతించునట్లు చేసి యతనికి రు. ౯౦,౦౦౦ లు లంచమిచ్చి సఫలీ కృతప్రయత్నులైరి. పిదప నప్పటికి షోడశవర్షప్రాయులై యున్న వత్సవాయ జగపతిరాజుగారిని క్రీ. శ. ౧౭౮౯ వ సంవత్సరమున దిరిగి తమ పితృపితామహార్జితరాజ్యమునకుం బట్టాభిషిక్తులం జేసి పూసపాటి పెదవిజయరామరాజుగారు పెద్దాపురపు సంస్థాన పునస్సంస్థాపనకర్తలై వినుతిగాంచిరి. యీయనయే తనభుజబలపరాక్రమములచేత మార్గమున నెన్ని చిక్కులు తటస్థించినను, యెంత ద్రోహము చేయించుట కానందరాజుగారు యత్నించినను, విజయుడై రాచవారి సహాయమునఅవ్వృత్తి పరిపాలకుడైన మహామ్మదీయునిసామదాన భేదోపాయముల నయమునను భయమునను లోబరచుకొని రాజ్యపట్టాభిషిక్తుడయ్యెనని కొందఱును జెప్పుచున్నారు. ఏది యెట్లున్నను స్వతంత్రేచ్ఛగల మన జగపతిరాజుగారు తిరుగపోయిన సంస్థానమును సంపాదించుట యెంతయు ప్రశంసనీయము.

## —శ్రీవత్సవాయ జగపతిరాజుమహారాజులుంగారు—

[౧౭౪౯—౧౭౫౮]

శ్రీవత్సవాయ జగపతిరాజుగారు బాల్యముననే తురుష్కులవలన కష్టము లనుభవించి, పిదప పెదవిజయరామరాజుగారిచేత బెంపబడి చిట్టచివరకు వారిసాహాయ్యముచేతనే తమ రాజ్యమునకు బునరభిషిక్తులై క్రీ. శ. ౧౭౪౯ మొదలుకొని పాలించిరి. ఈయన కాట్రేనికోన శ్రీదంతులూరి రామరాజుగారి తనూజయయిన సీతమ్మగారిని బరిణయమైరి. ఈరామరాజుగారు ధర్మపత్నియొక్క పుట్టినింటివారి కుటుంబలోని వారు.

వీరు రాజ్యమునకు వచ్చునప్పటికి ముస్తాఫానగరము, యేలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము, సర్కారులజాఫర్ ఆలీయను నతడు పరిపాలించుచుండెను. జాఫర్ ఆలీ, తనక్రింద అమీన్ దారుగానున్న సీమత్ ఆలీ తనకు తెలియకుండ లంచమును గ్రహించి పెద్దాపురసంస్థానమును తిరిగి వత్సవాయి వంశీయులకిచ్చివేసెననియాతనిపై మండిపడి, జగపతిరాజుగారిని సాధించి తిరిగి కోటను వశపరచుకొనవలెనని బలములంగూర్చుకొని పెద్దాపురముమీదకుదాడివెడలెను హిందూరాజులపై టాటోటుబూటకముల నుసికొల్పి గెలుపును బట్టుకొని గర్వితమతియయియున్న మ్లేచ్ఛమదగజేంద్రమేడ! ధర్మానువర్తనుడై ధర్మాయుధుడై సుగుణియయి, దుర్జనభర్జనశిష్టరక్షణములు దైవనియతకర్తవ్యములుగ భావించి

తృణీకృతశాత్రవుడై, నవీనయావ నావేశ సంవర్ధిత ధైర్య శౌర్యసముత్సాహుడై ప్రబలిన జగపతి క్షితినాథకంఠీరవం బేడ! అయినను లోతు దిగినంగాని తెలియదన్న సామెత ననుసరించి జాఫర్ ఆలీ పెద్దాపురాధినాథునితో యుద్ధము నకుం దలపడెను. కాని యీభూనాథుని పరాక్రమమునకు నిలువలేక వెన్నిచ్చి పాఱిపోయెను. నాటినుండియు జగపతి రాజుగారు జాఫర్ ఆలీకి బ్రక్కలోనిబల్లెమై గుండెలు తల్లడ మొనరించుచు, వారిపాలిటి కాలయములై యుండిరి. ఆయన యనిన జాఫర్ ఆలీకి హడలుగానుండెను. ఈ విషయమును లక్ష్మణకవి యిట్లు వర్ణించియున్నాడు.

"సీ. కన్నులను గ్రాంధకారంబువలె గ్రమ్మి
గట్టుపుట్టలు చెట్లుగానసీదు,
కలుకు గుత్తపు గ్రొత్తగడుసుసంకిలిజోడు
పోత్తినగతిపాజ్జలాడనీదు
చెవుల దాళం బమర్చిన మాడ్కి బంధించు
లేమల మొత్తలాలింపనీదు,
లలినాటియున్న గుండెలలోని గాలమై
యూర్పుల నడలింప నోపనీదు,
వత్సవయ జగపతి మహా వసుమతీశ
విశయ ధాటీ సమాటీక విజితవిముఖ
జాఫరలిఖానమానస స్తంభన ప్ర
గల్భరూఢభయావేశ గాఢతమము."

"చ. జగపతిరాజసింహకరసంభృతఖడ్గఘటోద్భవుండు సొం
పుగ పరవాహినీశ్వర సముత్కటజీవనమెల్లఁ గ్రోలి నే
ర్పుగ ఘనరాజమండల విరోధముఁ జేసిరజాఫరల్లి విం
ధ్యగిరినినామ శేషమగునట్టుగనుంచె జగద్ధితంబుగన్."

ఈ జగపతి రాజుగారిట్లమితపరాక్రమవంతులై పాలించుచుండగా నీయుత్తరసర్కారులు ఫ్రెంచివారి స్వాధీనము క్రిందకు వచ్చెను. అది వారికెట్లు వచ్చినదియు దరువాత జరిగిన బొబ్బిలియుద్ధసంక్షోభమును గుఱించియు నిచ్చట గొంత వివరముగ జెప్పుట సముచితముగ నుండకపోదు.

క్రీ. శ. ౧౭౪౮లో నైజామ్ కమ్రుద్దీన్ అసఫ్‌జా మరణమునొందెను. అతని పిమ్మట నైజాముపదవి నాక్రమించుకొనుటకై యతని ద్వితీయాత్మజుడు నాజరుజంగునకు, యితని మేనల్లుడైన ముజఫ్ఫరుజంగునకును, పోరాటములు జరిగెను. ఈ సుప్రసిద్ధకలహములలో నాంగ్లేయులు నాజరుజంగుపక్షమునను ఫరాసువారు ముజఫ్ఫరుజంగుపక్షముననను, వహించిరి. ఫ్రెంచివారీపైపోరాటమున విజయులైనను వారికిని ఆంగ్లేయులకును గలహములు తుదముట్టనయ్యెను. ఫ్రెంచివారు, హైదరాబాదు సింహాసనమున దమకు వశవర్తియగు ముజఫ్ఫరుజంగునుంచి ఆర్కాటునకు గూడ నవాబుగ దమ కనుకూలుడైనవాడున్న మంచిదనియెంచి, తమస్నేహితుడును, సహాయుడునైన చందాసాహేబున కాపదవి నొసంగవలెనని ప్రయత్నించిరి. ఇట్టి ప్రయత్నములు జరుగుచుండగా కొద్దిసంవత్సర

ములక్రితమే యుత్తరసర్కారులనుండి ఆర్కాటునకు మార్చ బడిన అన్వరుద్దీనును ౧౭౪౯ లో ఆంగ్లేయులు నవాబుగ నంగీకరించి వానిపక్షము నవలంబించిరి.

ఈ యుద్ధములో మునిగి తేలుచు, నాజరుజంగు, ఫ్రెంచివారి స్థానములైన మచిలీపట్నము, యానాముల నాక్రమించుకొనవలసినదని యుత్తరమునను్న దన యుద్యోగీయుల కుత్తరువిచ్చెను అప్పుడు ఫ్రెంచిగవర్నరుగ నున్న మాన్స్యూర్ డూప్లే మచిలీపట్టణము ప్రాముఖ్యస్థలమనియు, దానిని తిరిగి సంపాదించకపోయినచో దమ దేశాభ్యుదయము నకు భంగముకలుగుననియు దలంచి, యచ్చటనున్న తమ గిడ్డంగిని, నా పట్టణమును దిరిగి పట్టుకొనవలసినదని కొంత సేనను బంపించెను. పంపిన సైన్యము విజయమునొందుటయు నాయా ప్రదేశముల నున్న గిడ్డంగులపై ఫ్రెంచిబావుటా నిలుపుటయు గూడ జరిగినది.

ఆ సంవత్సరాంతముననే, ఫ్రెంచివారును వారి సహాయులును నాజరుజంగుయొక్క సేనాని వేశముం బొడచినపుడు, ఆతడు తా బేదారులచేత గపటమున వధయింపబడెను. తక్షణమే ఫ్రెంచివారలని ప్రతికక్షియయిన మిర్జాఫాజంగును, దక్కను సుబాదారుగా జేయ పుదుచ్చేరికి వెళ్ళిరి. అప్పు డచ్చట నొక గొప్ప యుత్సవము జరిగెను. ఆ సమయము నకే మిర్జాఫాజంగు మచిలీపట్టణమునకు చుట్టుపట్లనున్న ప్రదేశమును, కృష్ణానదికి దక్షిణముననున్న మొగలరాజ్యము లను గృతజ్ఞతాపూర్వకముగ ఫ్రెంచివారి కొసంగెను.

మిర్జాషాజంగు యీభోగమునుచాలాకాల మనుభవించియుండలేదు. అతడాయాత్రజనముల దనకు దోడ్పడుచుండుటకై కొంతఫ్రెంచిసేనను తనదగ్గరనుంచుకొన నిశ్చయించుకొనెను. అతనికోరికననుసరించి బుస్సీయొక్క సైన్యాధిపత్యముక్రింద 300 ఆంగ్లేయులును, 2,000 ఫ్రెంచిసిపాయిలును, వచ్చుచుండగా వారికి స్వాగత మొసంగి హైద్రాబాదునకు గొనిపోవు నుద్దేశ్యముతో గోలకొండకు బయలుదేఱెను. అతడు చాలదూరము ప్రయాణమై పోకమునుపే తనసేనలలో రేగినకలహము నణచుచుండగా నతడు వధియింపబడెను.

అప్పుడు మొదటినైజాముగుఅసఫ్‌జాయొక్క తృతీయ తనయుడగుసాల్బత్ జంగును, మిర్జాషాజంగుయొక్క యుత్తరాధికారియని బుస్సీప్రకటించెను. అతడుగామే క్రొత్తసుబాదారుత్తరముగా ఔరంగాబాదున కతివైభవముతోఁబోయి యటుతరువాత దానినే తనముఖ్యనివాసస్థానముగ చేసికొనెను.

బుస్సీ కొన్నినెలలవఱకు సాల్బత్ జంగుతో నుండిన వెనుక,నతని శరీరారోగ్యము సరిగాలేకపోవుటచే నుజలస్వస్థతనొందుటకై సముద్రతీరస్థమగు మచిలీపట్టణమునకు బోయెను. కాని యతడచ్చటజాలకాలమునిలుచుటకు వీలులేకపోయెను. నైజాముయొక్క దివానునకు బుస్సీయన్నను,ఫ్రెంచివారిసహాయమన్నను, మొదటినుండియు గిట్టనయ్యెను. అందువలన బుస్సీ మచిలీపట్టణమున కరిగినప్పుడతడు తనయభిప్రా

యముతో నేకీభవించువారితో గలసి కుట్రలుపన్ని ఫ్రెంచి వారి నుద్యోగములనుండి తొలగించి తరిమివేయ బ్రయత్నించెను. ఫ్రెంచివారియధికారము నైజామురాష్ట్రమున క్షీణించుచుండుట కనిపెట్టి శరీరస్వాస్థ్యమునకు లోబడియయినను తక్షణమే ఔరంగబాదునకు వెళ్ళవలసినదని మాంప్లే బుస్సీకి యాజ్ఞాపించెను. ఆయాజ్ఞ వచ్చినవెంటనే యింకను దేహారోగ్య మనుకూలపడకపోయినను, నా సేనాధిపతి తక్షణమే యొక్క నిమిషమైన నాలస్యమొనరించక సముద్రతీరమును విడిచి హైదరాబాదునకు వెళ్ళి అచ్చటనుండి ఔరంగబాదునకు బోయి మొత్తముమీద 300 మైళ్ళు ప్రయాణము చేసెను. ఫ్రెంచివారు వచ్చుచున్నారని తెలిసి నైజాము యొక్క దివాను తాను లొంగిపోయినట్లు తెలిపెను. నైజాము బుస్సీని నిజమైన ప్రాగ్దేశీయవైభవముతో బ్రవేశమిచ్చి యాదరించెను. దానితో వారి రాజీనామా పూర్తియయ్యెను. అంతట నైజామును బుస్సీయును గొప్ప యుత్సవముతో నగరున కరిగిరి. అప్పుడు కృతజ్ఞతాచిహ్నముగ నైజామ్ సాల్బత్ జంగ్, పరాసువారి పక్షమున బుస్సీకి సాధారణముగా నుత్తరసర్కారులని పిలువబడు రాష్ట్రములను ధారవోసెను. అప్పటినుండియు నా సర్కారుల మీదవచ్చు రివిన్యూవలననే ఫ్రెంచిసైన్యము పోషింపబడుచుండెను. ఆవిధమున ఫ్రెంచి సైన్యపోషణార్థము ౧౭౫౩ వ సంవత్సరమున ముస్తాఫానగరము, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము పరగణాలు ఫ్రెంచివారి యధీనముక్రిందకు వచ్చెను.

అంతట బుస్సీ, నైజాముచే క్రొత్తగా నొసంగబడిన యీ పరగణాలను తక్షణము బయలుదేఱివెళ్ళి స్వాధీనపఱచుకొనవలసినదని మచిలీపట్టణమందున్న ఫ్రెంచియున్నతోద్యోగీయుడగు మాన్స్యూర్ మొరాసిన్ అనువాని కుత్తరువుజేసెను. ఫ్రెంచివారి యధికారమును స్థాపించుటయం దతని కవసరమైనయెడల నుపయోగ పడగలదని ౧౫౦ మంది మ్లేచ్ఛులను ౨౫౦౦ ల మంది సిపాయిలును గల సైన్యమాతనికి సహాయముగ నంపెను.

ఈ నాలుగుపరగణాలకును గవర్నరుగానున్న జాఫర్ ఆల్లీఖాన్ ఫ్రెంచివారిపై దిరుగబాటుచేసి వారికెట్టులైన నీ పరగణాలను స్వాధీనపడకుండ చూడవలెనని ప్రయత్నించెను. ఇతడింతవఱకు శ్రీకాకుళము పరగణాలలోనున్న జమీందారులలో ప్రముఖుడైన విజయనగరమురాజగు పెదవిజయరామ గజపతిమహారాజుగారితో యుద్ధమొనరించుచుండెను. ఆయన కూడ ఫ్రెంచివారి కీపరగణాలను స్వాధీనపడకుండ చేయవలెనను తలంపు గలవాడగుటచేత జాఫర్ ఆలి ఆయనతో సంధి చేసికొనెను.

ఇట్లాయనతో సంధిచేసికొని యితరజమీన్ దారులను గూడ తమపక్షమునజేరి తమ యుద్యమమునకు దోడ్పడవలసినదని ప్రోత్సాహపఱచెను. ఈ జాఫరల్లీచేత బురికొల్పబడినవారిలో బొబ్బిలిజమీందారులగు రంగారావుగా రొకరు. ఈవఱకు దమకునుదమకును విరోధములున్నను ఫ్రెంచివారిని

దేశమునుండి వెడలగొట్టవలెనన్న యుద్దేశ్యముతో బూర్వ వైరమునను గట్టిపెట్టి బొబ్బిలి సంస్థానాధీశులగు రంగారావు గారు జాఫరల్లీతో గూడియున్న విజయనగర ప్రభువు లగు విజయరామరాజుగారితో గలియుట కంగీకరించి వచ్చిచేరిరి. అప్పుడు వీరందఱును ఫ్రెంచివారి నెదిరించుటకు తమతమ సైన్యముల నొక్కటిగా గలిపిరి. కాని రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారుల నిదివఱకిచ్చు శిస్తుకన్న తక్కువ కిచ్చెదనని చెప్పి మొరాసిన్, విజయరామరాజుగారిని జాఫర్ ఆలీఖానునుండి విడదీసి తమపక్షముల జేరునట్లు చేసికొనెను.

ఆవిధమున నారెండుసర్కార్లను మొరాసిన్, విజయరామరాజుగారికిచ్చుట తమస్థితికి క్షేమముగాదని యాలోచించి రంగారావుగారు ఫ్రెంచివారి కుద్యోసన చెప్పువిషయమున దీక్షను వహించి, యాయుద్యమమున దామొక ప్రధాన పాత్రమును గైకొనిరి.

జాఫరల్లీఖానుడు క్రొత్తగావచ్చి చేరిన తన స్నేహితుడైన విజయరామరాజుగారిచేత నంత త్వరితముగను విడనాడబడుటగాంచి తత్క్షణమే దేశమును వదలిపెట్టి పశ్చిమముగా నరిగి, తానిప్పుడు వదలిపెట్టిన దేశమును గొల్లగొనుటలో దనకు సాయపడవలసినదని మహారాష్ట్రులను బిలిచెను. వారును నందుల కంగీకరించి, యొక గొప్పసైన్యముతో బయలుదేఱి వచ్చి తూర్పుకనుమలనుదాటి శ్రీకాకుళము రాజమహేంద్రవరము పరగణాలగుండా దోచుకొనుచు బోయి తుదకు ఏలూరువద్దనుండి తమదేశమున కేగిరి.

ఈపని తలంపుగ గలిగినట్టియు, హానికరమైనట్టియు నీదండయాత్రను గుఱించి విన్నవాఁడై, బుస్సీ స్వయముగ ౧౭౫౮ వ సంవత్సరము జూలై నెలలో మచిలీపట్టణమునకు వెళ్ళి అచటనుండి ఆగష్టు నెలలో, మహారాష్ట్రులు దండయాత్ర చేసిన కాలమున రేగినయల్లరుల నణచుటకును, తమకు నూతనముగా నొసఁగఁబడిన పరగణాలపరిపాలనా విధానమును జక్కఁబఱచుటకును, నాలుగు పరగణాలకు మధ్యస్థముగా నున్న రాజమహేంద్రవరమునకు బోయిచేరెను. మహారాష్ట్రులును దాము దోచుకొన్న దోపిడీతో సంతృప్తి చెందినవారై జాఫర్ ఆలీ ఆశాపహతుఁడయ్యెననియు, నందువలన దమకే ముప్పును రాదనియు నమ్మి బుస్సీ ఔరంగబాదునకు వెళ్ళెను. అటుతరువాత నతఁడు మైసూరు మీఁదకు దాడి వెడలినప్పుడును అతనిని మహారాష్ట్రులును, సావనూరు నవాబును నెదుర్కొని నప్పుడును, అతనికి దోడై నిలిచి మఱువరాని సాహాయ్యము నొసరించెను.

* దివానుగానున్న షానవాజ్ ఖానును, నింతవఱకు రాజమహేంద్రవరము మొదలైన పరగణాలకు గవర్నరుగా నున్న జాఫర్ ఆలీఖానున్ను, ఇరువురుగలసి బుస్సీ ఔరంగబాదులో లేనిసమయముజూచి యతనిమీఁద కొండెములను జెప్పి నైజాముమనసు విరిచిరి. తన యౌన్నత్యమున కంతకును కారకు డీ బుస్సీయేయైనను, అతనిని ఫ్రెంచి సైన్యములను

* Godavary District Manual.

ద్వేషించుచు వారల నెల్లిన నైజాముకొలువునుండి తొలగించి యింగ్లీషువారిని రక్షించవలెనను నభిప్రాయముతో షానావాజ్‌ఖాన్ నైజాముతో బుస్సీపై నున్నవి కొన్నియు, లేనివికొన్నియు, గోరంతకొండంతలు చేసియుంజెప్పి కృతఘ్నుడను నపవాదమునకు బాత్రుడయ్యెను. అంతట నైజాము వాఁడు వచించినవన్నియుఁ సత్యములని నమ్మి వారి ప్రోత్సాహమున ఫ్రెంచివారిని తనకొలువునుండి తొలగించెను. ఇది ౧౭౫౮ వ సంవత్సరము మే నెలలో జరిగెను. ఇంతటి మహాత్పరాభవానలముచే సంతప్తమానసుడయ్యు, బుస్సీ తనమన స్థైర్యమును విడనాడక, శత్రువులు తమ్ము వెంటాడించి వచ్చుచున్నను హైదరాబాదు దగ్గర తనకున్న కొద్ది సైన్యముతో శత్రువుల నెదిరించుటకు నిల్చెను. ఆటి డట్లు తిన స్థానమును గాపాడుకొనుచు, శత్రువులను దరికి జేరనీయకుండ కొట్టుచు నతి తీవ్రముగ యుద్ధమొనరించుచు, మూడుమాసములు గడిపెను. అప్పటికతనికి మచిలీపట్టణమునుండి సైన్యములు వచ్చెను. వాని సహాయ్యముతో శత్రువులను జయించి నైజామువద్ద దన యథాస్థానము నాక్రమించుకొనెను. అప్పుడత డీవటిలో దనపై గుట్రలుపన్ని కొండెములుచెప్పి తుదకు సేనతో దన్నెదిరించిన షానవాజ్‌ఖానునుగూడ, తొలగించ డయ్యెను. ఈ వటికువలెనే నైజాముతరువాత నతనియంతటి వాడై యధికారము నెఱపుచుండవలయుననియే యతని కోరిక గనుక బుస్సీ దానిని నెఱవేర్చుకొనుటకై తాను

నైజాముచేత దొలగింప ; బడినప్పటినుండియు ప్రయత్నించి తుదకు సఫలీకృత ప్రయత్నుఁడయ్యెను. నైజాము సాలబత్ జంగు ౧౭౫౬ వ సంవత్సరము ఆగష్టు ౨౦ తేదీని బుస్సీని అతని పూర్వగౌరవములను బిరుదములను నాతనికి మఱల నొసంగి సన్మానించి యతివిభవముతో పూర్వస్థానమునం దతని నుంచెను. ఇంతకు పూర్వము సంభవించినట్టి యపాయము ముందిక నెప్పుడును గలుగకుండున ట్లేర్పాటులు చేయుచు బుస్సీ ౨౬ వ ఆగష్టు మొదలుకొని ౧౬ వ నవంబరు వఱకు హైద్రాబాదులో నుండెను. పిదప నీ ౧౬ వ తేదీనే తన యధికారమును పునఃస్థాపన మొనరించుటకై ౫౦౦ ల యూరోపియనులను, ౪ వేల సిపాయిలను దీసికొని యుత్తరసర్కారులకు బయనమయ్యెను. ఔరంగబాదునకు వెళ్ళదలచిన సాలబత్ జంగ్ నకు ౨౦౦ ల యూరోపియనులను, ౫౦౦ ల సిపాయిలను నొక విశ్వాసపాత్రుఁడైన యుద్యోగియుని క్రిందనుంచి తోడిచ్చెను.

బుస్సీ, హైదరాబాదులో యుద్ధ మొనరించుచున్న కాలమున సర్కారులలో ; గొన్ని కలహములు రేగెను. అందువలన నాసమయమున దమపక్షముననుండి విశ్వాసము గనబరచిన జమీందారును బహుమానించుటకును, కలహములు రేప ప్రోత్సాహమిచ్చిన నాయకులనుగాని, కలహకారకులైన జమీందారులను గాని శిక్షించుటకును బుస్సీ సర్కారులకు రావలసివచ్చెను. అతడట్లు ౧౬ వ నవంబరున హైద్రా

బాదులో బయలుదేఱి బెజవాడ, ఏలూరుల మీదుగా ౧౫ వ డిశంబరునకు రాజమహేంద్రవరము వచ్చిచేరెను. ఈ వఱలో బుస్సీ రాజమహేంద్రవర శ్రీకాకుళముల కధికారిగా ఇబ్రహీమ్‌ఖాను అను వాని నియమించెను. కాని హైద్రాబాదున యుద్ధము జరుగుకాలమున ఇబ్రహీమ్‌ఖాను ఫ్రెంచివారి యధికారమును ద్రోసిపుచ్చి తాను స్వతంత్రుడై పాలించుచుండెను.

ఇప్పుడు వచ్చుచున్నాడని తెలియుటతోడనే యతడు దేశమును విడచి పాఱిపోయెను, ఇంతవఱకు ఫ్రెంచివారికి లోబడి వారియెడల విశ్వాసముగలవాడై యుండిన పూసపాటి విజయరామరాజుగారు పదివేల స్వసైన్యముతోను చాల మంది జమీందారులతోను బుస్సీని గలసికొని యతనికి స్వాగతమొసంగి రాజమహేంద్రవరమున కరుదెంచిరి.

"♦తమ దేశములోనుండి విజయనగరరాజ్యములోనికి బాఱెడు కొండకాలువలను మళ్లించి బొబ్బిలిరంగారావుగారి కాపులు తమభూములకు బెట్టుకున్నందునను, దేశస్వభావమునుబట్టి బొబ్బిలివారిని సాధించుట సుసాధ్యము కాకపోయినందునను, విజయరామరాజుగారు మనస్సులో బొబ్బిలిరంగారావుగారిపై ద్వేషము వహించి యాయనను శిక్షించుటకై బుస్సీని తన యావచ్ఛక్తిని వినియోగించి బహువిధముల ప్రోత్సాహపఱిచి పురికొల్పెను. అందుమీద బుస్సీగారు

♦ఆంధ్రకవుల చరిత్రము.

బొబ్బిలిరాజ్యమును విడువవలసినదనియు, దానికి బదులుగా నధికమైన శౌర్యమును మూల్యమును గలదేశ మియ్యబడు ననియు, రంగారావుగారికి వ్రాసిరి. రంగారావుగారు పితృపితామహార్జితమైన బొబ్బిలిరాజ్యమును విడుచుట కంగీకరింపక పోవుటచే గాక తిక్కన సంస్థానాధిపతు లందఱుగా రాజమహేంద్రవరమునకు వచ్చి గూడుకొని సంప్రదించుకొని పోయెను” రాజమహేంద్రవరమునకు విజయరామరాజుగారును తక్కిన రాజులును వచ్చుటను గూర్చియు బొబ్బిలి రంగారావుగారు రాకపోవుటను గూర్చియు ... ప్రాంతములం దున్న దిట్టకవి నారాయణకవికృతమగు రంగరాయచరిత్ర మిట్లు వర్ణించుచున్నది.

“ఉ. పాయని వేడ్క విద్వినయపాయక రాయత బాహుశౌర్యలా
సాయకరాయఁడుం గిమిడిపట్టణపుం బృథివీశ్వరుండు నా
రాయణదేవుఁడున్ ♦నరసరాజుమాఢింగోలుగొండనున్నవున్
రాయఁడు నాదిగాఁగల ధరాపతులందఱు వచ్చి రత్తఱిన్.

గీ. ఉద్ధతులముల్కు సందర్శనోత్సుకత్వ
మాత్మఁజిట్టాడ నాజాడ నలసమన్న
దొరలువచ్చిరనూనుమహోగ్ర ప్రసంగ
కలితుఁడగు రంగరాయఁ డొక్కఁడుదక్క.

సీ. నిజభుజాదండనిర్ణిద్ర కోదండంబు
గాండీవకార్ముక క్రమముఁజూపఁ

---

♦ విజయనగరము దగ్గరనున్న కోటగండ్రేడు కాపురస్థులును ప్రసిద్ధులును నగు వత్సవాయ నర్సరాజుగారు వీరే.

జర్మభాగస్ఫుటచ్ఛటుల తూణీరముల్
కవదానసొంపు సంఘటిలఁజేయ
నాసీరముఖరనానాశంఖకధ్వనుల్
దేవదత్తారవోద్వృత్తిఁ దెలుపఁ
నూరెలఁ బరతెంచు జులుమతతేజీలు
ధవళాశ్వముల మస్తుద్రస్తరింపఁ

గీ. గలియుగార్జునుఁ డౌర యీఘనుఁడటంచుఁ
దనజగజ్జనమున్న నుద్ధతులముల్కు-
వీక్షణాపేక్ష నేతెంచె విజయరామ
రాజరాజన్యలోకమార్తాండమూర్తి.

చ. నలువదివేలకాల్బలము నాలుగువేల తురంగమంబులున్
నలువదియేఁబదేనుఁగు లనంతములైన శతఘ్నికాచయం
బులునొకవేయిలొట్టియలపూర్వవిభావిభవంబుఁ దెల్పుచున్
గొలువపరాసుతేనిఁగనుఁగొఁజనుదెంచెనురా జతిత్వరన్''

ఈ కడపటి పద్యమందు విజయరామరాజుగారు నలువదివేల కాల్బలముతో వచ్చినట్లు చెప్పబడుచున్నను, ఆయన వెంట నిజముగా వచ్చినసేన పదివేలుమాత్రమే యని యాంగ్లేయ చరిత్రకారుడైన ఆర్మ్‌దొరగారు వ్రాసియున్నారు. "ఇట్లుండగా రంగారావుగారి యనుమతిమీదనే బుస్సీదొరగారు కొందఱు సిపాయీలను బొబ్బిలి రాజ్యముమీదుగా మఱియొకచోటికి బోవుటకు బంపిరి. విజయరామరాజుగారి నేర్పువలననో, రంగారావుగారి బుద్ధిపూర్వకమైన యేర్పాటు

వలననో పంపబడిన సిపాయీలు త్రోవలో బొబ్బిలిభటులచే నెదిరింపబడి ముప్పదిప్రాణములను గోలుపోయి మగలి గావల సినవా రయిరి. ఈ యవమానము విజయరామరాజుగారి ప్రోత్సాహమునకు తోడుపడగా, బుస్సీగారు, రంగారావు గారిని శిక్షించి వారిని కుటుంబసహితముగా బొబ్బిలినుండి వెడలద్రోలుటకు నిశ్చయించు కొనెను. ఇన్నూటయేబండ్రు గుఱ్ఱపురౌతులును నాలుగుఫిరంగులును గల ౭౫౦ యూరోపి యనులతోను విజయరామరాజుగారి భటులును సిపాయీ లును గలిపిన ౧౧,౦౦౦ స్వదేశీయ పదాతిబలముతోను, కొంతిమంది క్షత్రియవీరులతోను బుస్సీగారు బొబ్బిలికోట మీదికి దండువెడలిరి.'' ఈ యుద్ధమున కనేకులు రాజులు ఫ్రెంచివారిపక్షము నవలంబించియున్న విజయరామరాజుగారికి సహాయార్థ మేగుదెంచిరి. రంగారాయచరిత్ర మీవచ్చిన రాజుల నిట్లు పేర్కొనుచున్నది.

''సీ. పాలుపొందఁ గాకర్లపూడి జగన్నాథ
రాజుగారొక కొంతఫౌఁజుతోడ
సత్యవరపురస్వామి యానెఁ రామ
భద్రరాజొక కొంతబలముతోడ
ఘనయశోనిధిముఖి శాఖపతిక్షమా
ధవమాళిరొకకొంత దళముతోడ
నలఘువిక్రముఁడు జింతలపాటినీలాద్రి
రాజుగారొకకొంత ఫౌఁజుతోడ

గీ. విజయ రామ రాజక్ష్మావిభునిని త్రిమోల
నేత్రపర్వంబొనర్చిరి నిజభుజాభు
జంగరసనాయమాన ప్రచండనిశిత
మండలాగ్ర ప్రభావళుల్ మెండుకొనఁగ.

మ. జగమెుక్కుమ్మడిఁ గ్రమ్మఁజాలెడుమహాసత్త్వంబుచేనొప్పుగొ
ప్పగుజా త్రాతులు గైత లొట్టియలు శోభాస్ఫూర్తి
దన్గొల్వమా
రుగులింగానవిభకీర్తి రాజమణి సంతోషిల్లగావచ్చెనొ
క్కగజోత్తంసము నెక్కి చొక్కమగు నుత్కంఠాతిరేక
మ్మునన్.

శా. ధన్యాటోపులుమండపాటికులరత్నంబుల్ మహారాజమా
ర్ధన్యుల్ శ్రీరఘునాధ రాజబలభద్రక్ష్మావరుల్ మున్ను సౌ
జన్యక్రీడలఁ బొలుదెంచి శిబికాచంచద్గతుల్మీఱ రాజ
న్యగ్రామణికిచ్చిరుత్సవముఁదత్స్వాంతంబు కాంతంబుగన్.

ఈపైనచెప్పినరాజన్యులేకాక, పెద్దాపుర సంస్థానాధీశులైన వత్సవాయ జగపతిరాజుగారుకూడ, విజయరామరాజుగారు తమ కొనరించిన యుపకారమును, మేలు నాలోచించి కృతజ్ఞతానిబద్ధులై సంగరరంగమున కేగిరి. వీరిరాకను రంగరాయచరిత్రకృతికర్తయగు దిట్టకవి నారాయణామాత్యుఁడిట్లు వర్ణించియున్నాఁడు.

"శా. శ్రీరంజిల్లుకడాని పైడిజల తాళీమాహురీ కెంపుటం
బారీయేనుఁగునెక్కి పెక్కులుమదేభంబుల్ గనుగొల్చిరా
గారూఢిన్ జతురంగసైన్యములతోఁ గర్జిల్లుచుఁ వత్సవా
యీరాయప్రభుమాళివచ్చెఁగడు రాజీకించిహర్షింపఁగన్"

హైదరాదుగూవద్ద జరిగిన యుద్ధములో ఫ్రెంచివారి యొక్క సత్తువను దెలిసికొన్నవాఁడగుటచేత జాఫర్ ఆలీ ఖాన్ బొబ్బిలివారికి సాయపడ రాఁడయ్యెను.

౧౭౫౭ వ సంవత్సరము జనేవరి నెలలోనే మనదేశ మందలి భిక్షుకులచేత నిరంతరము గానము చేయబడుచు ప్రసిద్ధివడసిన బొబ్బిలియుద్ధము జరిగినది. ఆ మహాయుద్ధమున వెలమదొరలగు రావువంశీయులును, వారిసైన్యములును, క్షత్రియవీరులును జూపిన యత్యంతశ్లాఘాపాత్రములగు ధైర్య శౌర్యసాహస పరాక్రమాది విజయములును, విజయరామ రాజుగారు తాండ్రపాపయ్యచే నన్యాయముగా నిహతులైన సంగతియును, మన తెలుఁగుదేశమునందలి జనసామాన్యము నకుఁ దెలియనివికావు.

అటుపిమ్మట నీసంగతివిజయనగరములోనున్న చంద్ర య్యమ్మగారికి తెలియగానామె తానికజీవించుట వ్యర్థమనియు బ్రతికియుండ దగదనియు జెప్పి సహగమనమునకుబోవ మె దనని ప్రయాణముకాగా, నామెబావగారికొమారుడుఆనం దరాజుగారువచ్చి సహగమనము చేయునెడల దన్నువధి యించి మఱియుబోవలసినదని చెప్పి యామె నెట్టకేలకా

ప్రయత్నమునుండి మఱలించెను. తన పినతండ్రిగారితో బుస్సీ గారు చేసిన యేర్పాటు లాయనకు సంతృప్తికరముగనుండక పోవుటచేత ఆనందరాజుగారు ఫ్రెంచివారిని దేశమునుండి వెడలగొట్టి వారికి బదులుగా నాంగ్లేయులను రప్పించవలె నని యోచించి కలకత్తాలోను, చెన్నపట్టణములో నున్న ఇంగ్లీషువారికి, ఉత్తరసర్కారులపై దండెత్తి వచ్చినచో తనశక్తియందున్న సాహాయ్యమును దానుచేయుదునని చెప్పి యుత్తరములు వ్రాసెను.

బుస్సీ శ్రీకాకుళము పరగణానుండి ౧౭౫౭ వ సంవత్స రాంతమున రాజమహేంద్రవరమున కరిగెను. అటనుండి యౌరంగాబాదునందు గొన్ని తొందరలు గలుగుటచే నక్కడకు బోవలసినవాడయ్యెను. అత డౌరంగాబాదున నున్న సమయముననే హిందూదేశమునందలి ఫ్రెంచిస్థానము లకు గవర్నరు జనరలుగా వచ్చిన మాన్స్యూర్ లాలీ, యత నిని గర్నాటకమునకు బోవలసినదని యాజ్ఞాపించెను. ఆతని యాజ్ఞానుసారముగ బుస్సీ ఔరంగాబాదునుండబడియలు దేఱి తనసైన్యముతో మచిలీపట్టణము దాపునకు వచ్చెను. కృష్ణానదిమీఁదనున్న రెయ్యూరువద్ద బుస్సీ తనకుబదులుగా వచ్చిన యుద్యోగియుడగు మూర్క్విస్ డికాన్ ఫ్లాన్స్ అను వానికి ౧౭౫౮ వ సంవత్సరము అగష్టు 3 తేదీని తన సైన్యాధిపత్యమును, ఉత్తరసర్కార్ల పరిపాలనాధికారమును గూడ నొప్పగించి, కర్నాటకమునకు వెడలిపోయెను.

ఔరంగాబాదునకు బోవుటకై బుస్సీ యెప్పుడు రాజమహేంద్రవరము విడచెనో, యప్పటినుండియు ఆనందరాజుగారు చేసిన పనులు ఫలోన్ముఖములు కాజొచ్చెను, బంగాళమునుండి కల్నల్ ఫోర్డు అనునతడు ౫౦౦ ల యూరోపియనులును ౨౧౦౦ ల మంది సిపాయిలును, ౧౦౦ ఓడకళాసువాండ్రును గలసైన్యముతో బయలుదేఱివచ్చెను. ఈవచ్చినఇంగ్లీషుసైన్యము నవంబరు ౨వ తేదీని విశాఖపట్టణమునుండిపయనమైపోయి ఖాసింకోటవద్ద ఆనందరాజుగారిని కలుసుకొనెను. ఆనందరాజుగారాసైన్యముతో గలిసి తన్నెదిరించుటకై రాజమహేంద్రవరమువద్ద సైన్యసమేతులై వచ్చియున్న ఫ్రెంచివారిని గలిసికొన నేగిరి. అప్పుడానందరాజుగారికిని ఇంగ్లీషువారికిని నొక యొడంబడిక జరిగెను. ఆయొడంబడికప్రకారము ముందు జయింపబడగల దేశమంతయు ఆనందరాజుగారికి రివిన్యూవసూలుచేసికొనుట కిచ్చుటకును, రేవుపట్టణములును, నదీముఖద్వారమునందున్న పట్టణములును ఇంగ్లీషువారి కిచ్చివేయబడుటకును, ఆనందరాజుగారు నెలకు రు ౫౦,౦౦౦లుసైన్యముక్రిందను రు ౬౦౦౦ లు ఉద్యోగీయుల ప్రత్యేకవ్యయములక్రిందనునిచ్చుచుండుటకును, ఆనందరాజుగారియొక్కగాని ఇంగ్లీషువారియొక్కగాని స్వాధీనమునందున్న దేశములనొకరికిమ్మొటకుగానియిచ్చి వేయుటకుగాని యుభయుల యంగీకారముమీదనే జరుగుటకును నేర్పాటు కావింపబడెను. పిదప నాయుభయులును, తమతమసైన్యము

లనొక్కటిగా జేర్చి ప్రయాణమైరి. *ఆయుభయుల సైన్యము లకు డిశంబరు 3 వ తేదీని ఫ్రెంచిసేనకు గొల్లప్రోలువద్ద విడిసియుండుట గానవచ్చెను. కాన్‌స్టాన్సు అను నతడు శత్రుసైన్యమునకు సేనాధిపత్యమును వహించెను. అతని సైన్యమున ౫౦౦ ల మంది యూరోపియనులు, ౬,౦౦౦ మంది సిపాయిలును, ౫౦౦ లు దేశీయ గుఱ్ఱపుదళములును, చాలమంది స్వదేశసైనికులు నుండిరి, ఆంగ్లేయులవైపు ౪౭౦ మంది యూరోపియనులు, ౧౯౦౦ ల మంది సిపాయిలు నుండిరి. ఇదియునుంగాక యానందగజపతిరాజుగారు ౫౦౦ ల మంది గుఱ్ఱపుదళముతోను, ౫౦౦ ల మంది కాల్బలముతోను మరికొంద రీటెకాండ్రతోను విలుకాండ్రతోను సహాయముగ నేతెంచిరి. డిశంబరు ౬ వ తేదీని ఆంగ్లేయులు, శత్రువులకు నాలుగుమైళ్ళ దూరముననున్న చేబ్రోలుగ్రామము నాక్ర మించుకొనిరి. ఉభయపక్షముల సేనాధిపతులుగూడ పరసైన్య మెంత యుద్దండముగవచ్చినను తమ్ము రక్షించుకొనుచు శత్రు వుల నెదిరించి యుద్ధముచేయుటకు దామాక్రమించుకొన్న స్థలము మిక్కిలి వీలుగాకుదిరినదని తమ స్థానములను గదలక మూడుదినములవఱకు నిలిచిపోయిరి. ఆంగ్లేయ సేనానాయ కుడు కుడిచేతిమీదుగా బర్వతప్రాంతములకు బోయి ఫ్రెంచి వారికి వెనుకనున్న రాజమహేంద్రవరమునకు బోవు రాజ మార్గమును బట్టుకొని యావిధముగ శత్రువుల నోడించుటకు

* Godavary District Gazetteer.

ప్రయత్నించిన బాగుగ నుండునని తలంచి డిశంబరు ౯వ తేదీ యుదయమున బైలుదేఱి చేబ్రోలుకు మూడుమైళ్ళ దూర మున నున్నట్టి కుందూరు లేక చందుర్తి గ్రామమునకు ౮ గంట లకు వచ్చిచేరెను. ఇప్పటికిని ఆంగ్లేయసైన్యమునకును పరాసు సైన్యమునకును నాలుగుమైళ్ళ యెడముకలదు. కాని ఆంగ్లే యులసైన్యమునకు వ్యూహము పన్నుటకు మునుపటికన్న నీస్థలమే మిక్కిలి యనుకూలముగ గుదిరియుండెను. ఆంగ్లేయ స్కంధావారమునకును, పరాసు శిబిరములకును నడుమ (ప్రస్తుతము పాడువడిన) వోదులపెంట గ్రామము కలదు. దాని నాక్రమించుకొన్న యెడల స్వరక్షణమునకేమి, శత్రు వుల నెదిరించుటకేమి మిక్కిలి యనుకూలమైన స్థలముగా నుండుననియు దానిని బట్టుకొనుటకే ఫోర్డు కదలి వచ్చు చున్నాడనియు నూహించి పరాసుసేనానాయకుడైన కాన్ ఫ్లాన్సు తానున్న స్థలమునుండి కదలి పరసైన్యాగమమును నిరోధించనేగెను. ఫోర్డుమాత్రము తానున్న స్థలమునుండి కదలక శత్రుబలమును బట్టియే తన వ్యూహమును జక్క బఱచుకొను నుద్దేశ్యముతో నాగిపోయెను. అత డాగిపోవు టకు గారణము సైన్యము యొక్క బలహీనతయు, భయ మునేగాని తదితరకారణము లెవ్వియు గావు. యు దిరిగి యింగ్లీషువారె తమ పూర్వసేనానివేశమైన చేబ్రోలునకు మఱలి పోవనున్నారనియు దలంచి కాన్ ఫ్లాన్సు తన సైన్య మును ముందుకు వేగిరపడి నడపించెను. ఇప్పుడుభయసైన్యములు ముఖాముఖి నొండింటిం డీకొని

నవి. ఇచ్చట నిరువాగులవారికిని గొప్పసమరము జరిగెను. ఆసంకులసమరమున కల్నల్ ఫోర్డుయొక్క బుద్ధికుశలతచేత నాంగ్లేయులకే విజయము చేకూరెను. ఈయుద్ధమున ఫ్రెంచి వారివైపు ఆఱుగు రుద్యోగీయులును, డెబ్బదిమంది జనులును చనిపోయిరి. డాబాపుగ జనిపోయినంతమంది జనమును ఖయిదీలుగ బట్టుకొనబడిరి. ఇక నాంగ్లేయులవైపు ఒక యుద్యోగీయుడును, నలుసేనుగురు జనమును నష్టపోయిరట, కొద్దిమందికి గాయములు తగిలెను. పరాసుసేనానాయకుడైన కాన్ఫ్లాన్సు, యుద్ధరంగమునుండి రాజమహేంద్రవరమునకు నలువదిమైళ్ళదూరమున్నను గుఱ్ఱపువారీమీద నర్ధరాత్రమునకు వచ్చి చేరెను.

ఈజిల్లాలో జరిగిన యుద్ధములో నిదియొకముఖ్యమైనది. దీనినిబట్టి ౧౭౫౮ సంవత్సరమువఱకు ఫ్రెంచివారి యాధీనములో నున్న యుత్తరసర్కారులు ఆంగ్లేయుల వశమగుటయు, నీజిల్లాయం దాంగ్లేయుల యధికారము స్థాపితమగుటయు సంభవించినది. ఈవిషయమున విజయనగరాధీశ్వరు లాంగ్లేయులకు చేసిన సహాయ మెన్నటికిని మరువదగినది కాదు. ఈయుద్ధమును ప్రజలు మొన్నటివఱకు సంస్మరించుచు భీతిల్లుచునే యుండిరి. ఇంతటినుండియే మనమింగ్లీషువారికి బానిసలమైతిమి!

౧౭౭౭ వ సంవత్సరమున నైజామురాష్ట్రమునుండి రోహిలాలు దండెత్తి వచ్చుచున్నపుడు, ప్రజలందరు కూడ,

తమపోయిన రాష్ట్రమును దిరిగి సంపాదించుకొనుటకై పరాసువారసంఖ్యాకములగు సైన్యములను గూర్చుకొని వచ్చుచున్నారనియే తలపోయుచు వచ్చిరి.

ఓడిపోయిన ఫరాసుసైన్య మనేకమార్గముల బట్టి రాజమహేంద్రవరము వచ్చి చేరెను. కల్నల్ ఫోర్డు తత్క్షణమే ౧౫౦౦ ల యింగ్లీషు సిపాయిలను ముందుగాబోయి రాజమహేంద్రవరదుర్గము నాక్రమించుకొనవలసినదని ప్రయాణము చేసి పంపి తాను వెనుకనుండి బైలుదేరెను.

తమపై వచ్చుచున్నది యొక్క సైన్యభాగమని యెఱుంగక యొక మహాసైన్యమని తలంచి, కోటలోనున్న ఫ్రెంచివారు తమ్ము రక్షించుకొనుటకుం జాలినంత మూలబలము లేకపోవుటచే దుర్గమును విడిచిపెట్టిరి. కొందఱు యూరోపియనులొకపడవ నెక్కి గోదావరిని దాటుటకై ప్రయాణమైపోయి నదీమధ్యముననుండిరి. చాలపడవలు మందుగుండుసామానుతో నిండి గోదావరి యావలియొడ్డును జేరుకొనెను.

అప్పుడింగ్లీషువారు రాజమహేంద్రవర దుర్గము నాక్రమించుకొని, కోటగోడలమీదనుండి గోదావరి కవతలియొడ్డున మందుగుండుసామానుతో నున్నవారిపై నగ్నివర్షమును గురిపించసాగిరి. దానివలన నవతలిగట్టుననుండు శత్రువులు తమమందుగుండుసామానునుదీసికొనిపోవుటకుగాని, యచ్చట నిలిచి యుండుటకుగాని వీలుకలుగదయ్యెను. కొంతమందుగుండుసామానుతోను, మఱికొన్ని యుద్ధోపకరణములతోను

రాజమహేంద్రవరము కోటలోనున్న పదునేడుగురు యూరోపియనులు ఖయిదీలుగ బట్టుకొనబడిరి. అప్పుడు మిగతసైన్య విభాగమును దీసికొని కల్నల్ ఫోర్డు రాజమహేంద్రవరము వచ్చి చేరెను. ఆనందగజపతి రాజుగారు వాసిరెడ్డి ఖిలాలనిజము నకు యుద్ధసంబంధముగ సేవిధనుగ జోక్యమునుగలుగ జేసి కొనక ఫోర్డు వెంబడిని సహాయముగ రాక, యుద్ధరంగమున కిరుగుపొరుగుల తచ్చాడుచుండెను. ఆంగ్లేయసైన్యము తక్షణమే ఫ్రెంచివారిని వెంటాడించి తరుము నుద్దేశముతో ౨౩ వ తేదీని గోదావరినదిని దాటెను.

ఈసంగతి ఇట్లుండగాకుందూరుయుద్ధములో విజయులైన యానందగజపతి రాజుగారు ఆంగ్లేయులను సహాయము దీసికొని తన రాజ్యము నభివృద్ధిపరచుకొను నుద్దేశముతో వచ్చుచున్నారని యితర జమీందారులవలెనే శ్యామల కోటలో ఠాణా చేసికొనియున్న పిఠాపురప్రభువులైన పెద మహీపతి రాయనింగారును నీలాద్రి రాయనింగారును కూడ ననుమానించిరి.

పెదమహీపతిరాయనింగారు రుస్తుంఖానునిచేతఁ దల కొట్టబడిన బుచ్చన్నగారి మనుమలు. నీలాద్రిరాయనింగారు, బుచ్చన్నగారి యన్నకొమారులు. మహీపతిరాయనింగారు, బాల్యులైయుండుటచేత నీలాద్రిరాయనింగారే వ్యవహార దక్షులై రాజ్యకార్యములను నడపుచుండిరి.

♦ వీరిరువురును పెద్దాపురపుశ్రీవత్సవాయి జగపతిరాజుగారు మొదలగు నుత్తరసర్కారులందలి యితర జమీందారుల వలె కుందూరుయుద్ధమున ఫ్రెంచివారిపక్షమున నిలువబడి జోక్యము కలుగ జేసికొనినవారు. వీరియువ్వురును, జగపతిరాజుగారు, నాంగ్లేయులు శ్యామలకోటపై దండెత్తివచ్చుచున్నారని విని వారి నెదిరించుటకై కాకినాడలోనున్న డచ్చి (వలందు) వారిని సహాయముకోరిరి. మూడు నెలలవఱకు డచ్చివారి సహాయముతో పిఠాపురప్రభువులు శత్రువులకుదుస్సాధ్యులై నిలిచి కోటను సంరక్షించుకొనుచుండిరి. కాని యాహారపదార్థముల లేమివలననో, లేక మరి యేకతముననో కోటలోనున్నవారు శత్రువులకు లొంగుటయు, కోటపై నాంగ్లేయుల బావుటా ప్రతిష్ఠింపబడుటయుగూడ జరిగినది. అటుపిమ్మట గజపతిరాజుగారు పెద్దాపురపుమార్గమున రాజమహేంద్రవరము పోవుచు నల్లచెఱువు గ్రామముదగ్గఱ దండువిడిసి గజపతిరాజుగారిని వంచించు కృత్రిమోద్దేశ్యముతో పెద్దమనుష్యులద్వారా తమ్మొకమాఱు కలిసికొనవలసినదని నమ్మకముగా ఆయనకు గబురుపంపించెను. దీనినంతయు సత్యమేయని విశ్వసించి జగపతిరాజుగారు గజపతిరాజుగారి కొఱకు గోటలో మేజువాణి మొదలగునవి సిద్ధము జేయించి సముచితగౌరవపరివారముతో ఆయనను గలిసికొని పాలకీయెక్కి ప్రయాణమై పోయి నల్లచెఱువును సమీపించిరి. ఆనందగజపతిరాజుగారును

♦ History of pithapurhm.

తమ కృత్రిమోద్దేశ్యపరిసమాప్తికొఱకీవఱకే ముందు మున్నగు
నవి ధట్టించి బాగుచేసి సిద్ధముగానుంచిన ఫిరంగులను పరి
వారసహితులైన జగపతిరాజుగారు సమీపమునకు రాగానే
ప్రేల్పించిరి. అప్పుడు వత్సవాయ జగపతిరాజుగారు ఆనంద
రాజుగారి కాపట్యమును, దమ పరివారము చెల్లాచెదరై
పోవుటయును దెలిసికొని, యొక్క గుఱ్ఱము నెక్కి యొకాయొకిని
బోయి తమకోటలో బ్రవేశించి, తమ సైన్యములు యుద్ధ
సన్నద్ధములు గాకయుండుటచేత నొకవేళ నీలోపుననే రాగల
యానందరాజుగారిని నిగ్రహించుట కష్టమనియు, నందువలన
నిట్టి సందిగ్ధసమయమున మరణమే శ్రేయస్కరమనియు నెంచి
నగర్లలో డుపాకిముందు పరపించి స్త్రీలతోగూడ జిచ్చంటించు
కొని మృతినొందుటకు సిద్ధపడిరని స్థానికచరిత్రము జెప్పు
చున్నది. కాలముతప్పి వచ్చినపుడు శూరుడైన నాలోచింపక
తీరదుకదా! అంతట గజపతిరాజుగారు వచ్చి సంగతి తెలిసి
కొని మీరు చనిపోవలసినంత యగత్యము లేదనియు, మీ
కొమారులైన తిమ్మరాజుగారిని, రాష్ట్రమును, దమ కప్పగింత
చేసి మీయిష్టమువచ్చిన యేస్థలమునకైన వెడలిపోవలసిన
దనియు జగపతిరాజుగారితో జెప్పిరి. అంతట జగపతిరాజు
గారు తాము బ్రతికియున్న యెడల నెప్పటికైన ఆనందగజపతి
రాజుగారిపై బగసాధించుకొనవచ్చునని తలంచి దేశమును
విడచిపెట్ట నంగీకరించిరి. కాని జగపతిరాజుగారు, గజపతి
రాజుగారిని నమ్మలేక తాము గోదావరిని దాటకమున్నే

తమ కేహానిచేయుదురో యని యెంచి గజపతిరాజుగారి తాలూకు పంద్రెండువందల సైన్యమునకు సరదారులైన యిరువురు పెద్దమనుష్యులు వారి సైన్యములతో వచ్చి తమ్ము గోదావరి గడచి వెళ్ళుపర్యంతము క్షేమముగా సాగనంపుటకు కరారుచేసికొనిరి. ఆ ప్రకారమే యిరువురు సరదారులు తమ సైన్యములతో వచ్చి జగపతిరాజుగారిని రాజమహేంద్రవరమువద్ద గోదావరిని దాటించి యవతలికి సుఖముగా బంపించిరి.

—♦ పెద్దాపురము గజపతులయాధీనము క్రిందకు వచ్చుట ♦—

పిదప ఆనందగజపతి రాజుగారును జగపతిరాజుగారి భార్యాపుత్రులను దమ యధీనములోనుంచి, పెద్దాపురపు జమీందారీని వశపఱచుకొనుటకు దమ తరపు వ్యవహారస్థులను నియమించి కోటలో తానావేయించిరి. నాటినుండియు పెద్దాపురము కోట యొక కొంతకాలమునటుకు గజపతుల యధీనము క్రిందకు వచ్చెను.

అటుపిమ్మట ఆనందగజపతిరాజుగారు రాజమహేంద్రవరము వెళ్ళిరి. అప్పటికప్పుడే యేతద్దుర్గము ఫోర్డు స్వాధీనమై యుండుట యానందరాజుగారి కొక యద్భుతముగా గనబడెను. రాజమహేంద్రవరదుర్గమును దమ స్వాధీనము చేసినయెడల దామిచ్చెదమన్న సైన్యపోషకధనమును ఆనందరాజుగారు చెల్లించలేకపోయిరి. అందువలన కల్నల్ ఫోర్డు ఫ్రెంచివారిని దఱుముట వదలిపెట్టి, మిక్కిలి విసుగుదలతోను, కోపముతోను, గోదావరినిదాటి యీవలకు వచ్చెను. ఆనందగజపతి

రాజును, ఫోర్డు తనపై బగసాధించుకొన వచ్చుచున్నాడేమో యని తలంచి రంపమన్యము దిక్కుగా దగ్గరనున్న కొండలకు బాఱిపోయిరి.

ఆంగ్లేయ సైన్యాధిపతియైన కల్నల్ ఫోర్డు విశాఖపట్టణమున నున్న తమ యాంగ్లేయులతో రాకపోకలు జరుపుట కనువుజేసికొనుటకై పెద్దాపురమువద్దనుండ బోయెను. విశాఖపట్టణమున క్రీ॥శము నెలలో ఆంద్రూస్ యను నొక యుద్యోగస్థుడు వచ్చియుండెను. ఆతడానంద గజపతిరాజుగారితో రాజీనామా రాయభారములు జరుపుటకు వెనుకకు బంపబడెను. ఆతడానంద గజపతిరాజుగారిని కొండలలో నుండగనే దర్శించి రాయభారము నడపెను. ఆంద్రూస్ ఆనందగజపతిరాజుగారిని శాంతపఱచి తమతో రాజీకివచ్చిన ట్లొడంబఱచి పెద్దాపురము వద్దనున్న యాంగ్లేయసైన్యమును గలిసికొన వలసినదని ప్రోత్సాహపఱచెను.

ఇట్లు మిక్కిలి విలువగలిగిన కొంతకాలమును వ్యర్థపుచ్చిన తరువాత ఫోర్డు ౧౭౫౯ వ సంవత్సరము జనవరి ౨౮ వ తేదీని పెద్దాపురమునుండి బయలుదేఱి ఫిబ్రవరి ౬ వ తేదీనాటికి ఏలూరు చేరెను. అచ్చటనుండి యతడు నరసాపురమువద్దనున్న ఫ్రెంచివారి గిడ్డంగి నాక్రమించుకొనుటకు కెప్టన్ నాక్సు అనువానికి సేనాధిపత్యమునిచ్చి కొంత సైన్యమును బంపించెను.

నర్సాపురమున ఫ్రెంచివారిపక్షమున నూటయిమంది యూరోపియనులును, 300 ల మందియో లేక 400 ల మందియో సిపాయిలును గలరు. ఆతాలూకాకు జమీందారుండైన మొగల్తుర్తి (నరసాపుర సమీపగ్రామము) రాజును ఆంగ్లేయులు తమకువచ్చి సాయముపడవలసిన దని కోరిరి. ఆ యాహ్వానమునకు మనఃపూర్వకముగ సంతసించిన వాడై మొగలితుర్తి జమీందారుడు కప్టెన్ నాక్సు రు వచ్చి కలిసికొని తనకు జేతనైన సహాయమునంతయు జేసెను. ఫరాసువారును జమీందారునియొక్క సహాయమునే నమ్ము కొనియుండిరి. కాని యెప్పుడు జమీందారుడు వారికి సాయ పడ నేగడయ్యెనో వారప్పుడే గిడ్డంగిని వదలిపెట్టి తాము మోసుకొనిపోవలేని మందుగుండుసామానునంతయు గోదా వరిలో ముంచివేసి వెళ్ళిరి. నాక్సు, గిడ్డంగిని రక్షించుట కొఱకై కొంతమంది సైనికుల నచ్చట దిగవిడిచి మిగత పరివారముతో నేలూరువచ్చి యింకను నచ్చటనే నిలిచి యున్న విజయనగరము రాజుగారిని గలిసికొనెను.

ఈలోపుగా కాన్ఫ్లాన్సు మచిలీపట్టణమునకుబోయెను. ఇతనియొక్క కోరికవలన దక్కనుసుబాదారుడైన సాలబత్ జంగు కృష్ణాపల్లపుభూములనున్న యాంగ్లేయులపై దాడి వెడలెను. మార్చి 7 వ తేదీని ఫోర్డు మచిలీపట్టణమునకు బోయి దాని నొక మాసమువఱకు ముట్టడించినపిదప నాక్ర మించుకొనెను. 1759 వ సంవత్సరము మే నెల 14 వ

తేదీని ఫోర్డు సాలబత్ జంగుతో సంధిచేసికొనెను. ఆ సంధి ప్రకారము మచిలీపట్టణమునకు జుట్టుపట్లనుండు ప్రదేశమును, నైజాంపట్నమును ఈనాముగా నాంగ్లేయుల కియ్యబడెను. అప్పటినుండియు సుబాదారుకూడా ఫ్రెంచివారితో దనకున్న స్నేహమునంతయు వదలుకొందుననియు నిక నెప్పటికి నుత్తర సర్కారులలో ఫ్రెంచివారిని స్థిరనివాస మేర్పఱుచుకొనకుండ నిరోధించెదననియు వాగ్దానము జేసెను. ఈ యొడంబడికను బట్టి గోదావరీనది కుత్తరముననున్న దేశమంతయు మఱల దక్కను సుబాదారుని యధికారముక్రిందకు వచ్చెను.

ఆ తక్షణమే యుత్తరసర్కారునుండి ఫ్రెంచిసైన్య మింకను పూర్తిగా వెడలిపోదయ్యెను. ౨౫౦ మంది యూరోపియనులును, ౨౦౦౦ మంది సిపాయిలును గల యొక చిన్న సైన్యము ఆంగ్లేయులకు వచ్చుచున్న యాహారపదార్థములను గాని, మందుగుండు సామానునుగాని, సహాయసైన్యమును గాని నాశనముచేయుటకై మచిలీపట్నము రాజమహేంద్ర వరములకు మధ్య నిలిచిపోయెను. ఆసైన్యము రాజమహేంద్ర వరమునకు బోయి యచ్చటనున్న యాంగ్లేయ సైనికుల నోడించి యాదుర్గము నాక్రమించుకొనెను. కాని త్వరలోనే సాలబత్ జంగును గలిసికొను నుద్దేశ్యముతో దానిని విడిచి పెట్టి వెళ్ళిపోయెను.

తరువాత రాజమహేంద్రవరమువద్ద గోదావరీనదిని దాటి పశ్చిమముగా నేగిన వత్సవాయజగపతి రాజుగారు కంభమ్మమెట్టుకు బోయి యటనుండి వేలుపుకొండ కరిగి

యక్కడ నుండి పం(డెండువందల సైన్యమునకు వేలుకొండ తుపాకి నౌకరీ ఖాయము చేసినపిదప వారిని వెంటబెట్టుకొని రాజలింగము, కొత్తపల్లిమార్గమున మన్యమునుబట్టి పెద్దాపురసమీపమునన్న రాగంపేటకు నాలుగు నెలలకు వచ్చి చేరిరి.

ఈలోపుననే మచిలీపట్టణ మాంగ్లేయులకు వశమైన దని తెలియకమునుపే మొరాసిస్ అను ఫ్రెంచి యుద్యోగియుడు తగినంత యుద్ధసహాయసంపత్తితో దక్షిణమునుండి మచిలీపట్టణమునకు బయలుదేరెను. అతడు నవంబరు ౧౧ వ తేదీకి అప్పటికిని డచ్ (వలందు) వారి యధీనములో నున్న కాకినాడ వచ్చిచేరి, కుందూరుయుద్ధమున దమపక్షము నవలంబించి పోరాడినట్టి విశ్వాసపాత్రుడై మిత్రవర్యుడుగా నున్న జగపతిరాజుగారితో దమ యధికారమున పునఃస్థాపన మొనరించుటకును, ఆంగ్లేయుల నుత్తరసర్కార్లనుండి తరిమివేయుటకును గుట్రలుపన్న జొచ్చెను. కాని యాతని ప్రయత్నము శీమాత్రమును సఫలములు కాకపోవుటచేత వెంటనే ప్రయాణమై యోడమీదుగా పుదుచ్చేరికివెళ్ళి చేరెను.

ఆ సంవత్సరమే డిశంబరు నెలలో ౫౦ మంది యూరోపియనులును ౧౦౦ మంది సిపాయిలును గల యొక్క చిన్న ఫ్రెంచిసైన్యము వెనుకటివలెనే జగపతిరాజుగారితో యోచనలుచేసి వ్యవహారము జరుపుటకై కాకినాడవద్ద దిగెను. శ్రీజగపతిరాజుగారు, రావు నీలాద్రిరాయనిం గారితో గూడి డచ్చివారి ద్వారా రాయభారములు జరుపుచుండ గొందరు

పరాసువారు కోటమీదనున్న యాంగ్లేయుల బావుటాను పెకలించి తమ బావుటాను నాటిరి. పిదప నీసంగతియంతయు గజపతిరాజుగారికి జాబులమూలమున దెలిపిరి. అటు పిమ్మట ఆనందగజపతిరాజుగారు తమ సైన్యమునంతయు వెంటబెట్టు కొని జగపతిరాజుగారిని, ఫ్రెంచివారిని సాధించుటకై పయన మయిరి. ఈ సమయమునకే మచిలీపట్నమువద్ద కెప్టెన్ ఫిషర్ యొక్క సేనాధిపత్యముననున్న యాంగ్లేయసైన్యము బంగాళమునకు బయనమయి వెళ్ళుచుండెను. ఆ సైన్యాధీశు డగు ఫిషర్, రాజమహేంద్రవరము వచ్చుసరికి కాకినాడవద్ద ఫ్రెంచిసైన్యమున్నదని తెలిసికొని యచ్చటికి దాని నోడించ నరిగెను. ఈసైన్యమును, ఆనందగజపతిరాజుగారి సైన్యమును గలిసి కాకినాడ వెళ్ళునప్పటి కచ్చటనున్న కొంతమంది ఫ్రెంచివారు, డచ్చివారి కోటలో దాగికొని పిదప లొంగి పోయిరి. ఓడలు దిగని మరికొందరు ఫ్రెంచివారు తమ నౌక లను పుదుచ్చేరిమార్గమునకు ద్రిప్పిరి.

ఆనందగజపతిరాజుగారు తమసైన్యములను దీసికొని శ్యామల కోటలోనున్న ఫ్రెంచివారిని దరుమగొట్టి, యాంగ్లే యుల బావుటాను మఱల బాతుటకై యుద్ధప్రయత్నములు చేసికొని సైన్యముతో జాళుక్య భీమవరమువద్దనుండి వెళ్ళు చుండిరి. అప్పుడు రావునీలాద్రిరాయనింగారును జగపతిరాజు గారును కాకర్లపూడివారితో గలిసి కొన్నివేల ఫౌజుతో గజపతిరాజుగారిని మార్కొనసరిగిరి. కాని మార్గమధ్యమున వీరిసైన్యములో గొంతభాగ మేకారణముననో వెనుకకు

తగ్గినది. అప్పుడు నీలాద్రిరాయనింగారు సంగతిసందర్భములను సైన్యస్థితిగతులను, యుద్ధోపకరణవిధానములను విచారించి యీ సందర్భమున మనము నిగ్రహించుట కష్టమనియు, నిప్పుడు తిరిగి శ్యామలకోట వెళ్లుట యుక్తమనియు జగపతి రాజుగారితో నుడివిరి. కాని జగపతిరాజుగా రమేయపౌరుష ముతో వచ్చినవార లెట్లును రానే వచ్చినారము. యుద్ధ రంగమునకు బ్రయాణమై వచ్చి వెనుకకు మరలిపోవుట వీర వరేణ్యుల కుచితమగునా? తిరిగి మరలుముఖము వెట్టుట శౌర్యలక్షణము కానేరదని చెప్పి యతిసాహసముతో మిగత బలములతో గజపతిరాజుగారి నెదిరింపబోయిరి.

ఈ యుభయసైన్యములు ఉండూరు (శ్యామలకోట సమీపస్థగ్రామము) సమీపమున సంధించినవి. అచ్చట నొక గొప్ప సంకులసమరము జరిగెను. ఈయుద్ధమున గజపతిరాజు గారి ధాటికి నిలువలేక రావు నీలాద్రిరాయనింగారు యుద్ధ రంగమునుండి పాఱిపోయి తిరిగి శ్యామలకోటకు వచ్చి యచ్చటనున్న చిన్నవాండ్రను వెంటబెట్టుకొని యింక నక్కడ నిలువక జూపల్లెవారి సంస్థానములోనిదగు రాఘవ పురమునకు వెళ్ళి యట డాగియుండిరి! జగపతిరాజుగారు మాత్రము ధైర్యశౌర్యములతో నిలువబడి యమితవిక్రమ మును జూపుచు, సమరక్రీడను సలుపుచుండిరి. ఇట్లుండగా ఆయన యాకస్మికముగా గుండుదెబ్బ తగిలి నేలంబడిరి. అంతట నీసమాచారము ఆనందరాజుగారికి దెలియజేయ నప్పటి కాయనతల కొట్టి తీసికొనిరావలసినదని కఠినమైన

యుత్తరువుచేసిరి. అంతట నీ రాజశాసనము నాలించి సత్య వరపు జమీందారుడును క్షత్రియుడును, భోగాపురము కాకర్ల పూడివారి వంశీయుడును, స్వీయసంఘాభిమానియు నగు శ్రీరామభద్రపాయకరాయనింగారు ఆనందరాజుగారి సముఖ మునకరిగి, యింతటి యకార్యము నొనర్చుట మీవంటి రాజేంద్రులకు ధర్మముకాదనియు, నిదియునుగాక మీతండ్రి గారు మిమ్ములను, యీ జగపతిరాజుగారిని బెంచినారనియు, వీరికి పోయిన సంస్థానము మీతండ్రిగారు నిర్వాహకముచేసి యిచ్చినారనియు, నందువలన నిప్పుడు మీరును పాలకీ పంపించి సగౌరవముగ నాయనం దోడ్తెచ్చుట యుక్తము. కాఁ తలకొట్టిన నిక్కలి యపకీర్తి రాగలదనియు మనవి జేసికొనిరి. అటుపిమ్మట మీరే వెళ్ళి జగపతిరాజుగారిని, పాలకీలోనుంచి తీసుకురావలసిన దని యానంద గజపతిరాజు గారు పాయకరాయనింగారికి సెలవిచ్చిరి. ఆ ప్రకారమే యాయనయు వెళ్ళి వారిని తీసికొనివచ్చిరి. కాని యానాడే మూడుఝాములకు దమ భౌతిక దేహమును చాలించి వారు తమ యిరువదియయిదవయేట ననగా క్రీ. శ. ౧౭౫౯ వ సంవత్సరమునకు సరియయిన ప్రమాదిసంవత్సర పుష్యశుద్ధ నవమినాడు వీరస్వర్గ ప్రాప్తులైరి.

ఈలోపున రావు నీలాద్రిరాయనింగారు శ్యామలకోట విడిచిపెట్టి పాఱిపోవుటను తెలిసికొని గజపతి రాజుగారుండూరు నుంచి శ్యామలకోటకువచ్చి కోటలోనున్న ఫ్రెంచిపటాలము

లను తటిమి తిరిగి యచట నాంగ్లేయుల బావుటాను నిలిపిరి.

ఈ ప్రకారము జగపతిరాజుగారిపాలన ముగింపునకు వచ్చెను. శ్రీరామవిలాసమను మహాప్రబంధమును రచియించి నట్టియు, ముందు జెప్పబోవు తిమ్మజగపతిరాజుగారి కాశ్రయులై యుండినట్టియు, నేనుగు లక్ష్మణకవిగారు యీజగపతి రాజుగారి కాలమునసయిత ముండినట్లాయనచే రచియింపబడిన యీక్రింది చాటుపద్యము నుడువుచున్నది.

ఉ. ఆయతవత్సవాయ సుకులాంబుధి పూర్ణనిశాపతీ! జగ
ద్గేయశుభాకృతీ! విదితకీర్తి సతీకమనీయయావన
ప్రాయనలాకృతీ! సతతవైభవనిర్జిత పూర్వదిక్పతీ!
ధీయుతవాక్పతీ! జగపతీ! నృపతీ! సుకృతీ! మహోన్నతీ!

♦ ఈ జగపతిరాజుగారు కవిత్వమునందు నిపుణులై పెక్కుపద్యములు, శతకములు మొదలైనవి భద్రాద్రిరాముల మీద జెప్పినట్లు రామవిలాసములోని యీపద్య ముద్ఘోషించుచున్నది.

చ. పదములు కీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికా
మృదుపదదండకంబులు సమిద్ధగతి రచియించి కామిత
ప్రదునకు భద్రశైలప్రభుభక్తకుఁ గానుకగా నొసంగెనే
త్రిదశులు మెచ్చ దాజగపతిప్రభుచంద్రుఁడు భక్తిపెంపునన్.

---

♦ వీరి నాటినుండియే విజయనగరపు పూసపాటివారు గజపతి బిరుదమును, పెద్దాపురపు వత్సవాయవారు జగపతి బిరుదమును వహించుచు వచ్చినట్లు కాన్పించుచున్నది.

—♦ ఆనందగజపతిరాజుగారి మరణము ♦—

శ్రీ వత్సవాయ జగపతిరాజుగారు చనిపోయిన యనంతరమున వారి సహధర్మచారిణి యగు సీతమ్మగారి కామె యొక్క భర్తమరణ ప్రకారం బంతయు రామభద్రపాయకరాయనింగారు తెలియజేసిరి. ఆ పతివ్రతా శిరోమణియు వెంటనే యాయన వాక్యము లాలించుచునే సహగమనమునకు సిద్ధమయ్యెను. ఈ సంగతి యానందరాజుగారికి దెలియజెప్పగా నామె యిష్టమేలాగో నాలాగే కానియ్యవలసినదని చెప్పిరి. అప్పటికి శ్రీ సీతమ్మగారికొమారులును, వత్సవాయ వంశాబ్ధిచంద్రులు నగు తిమ్మజగపతిరాజుగారు పూసపాటి వారి యధీనములో నున్నందున, సహగమన సంసిద్ధయయిన యా పవిత్రచరిత్ర దమకొమారులు భద్రమునుండి యని పాయకరాయనింగారి కొప్పజెప్పి సహగమనమునకు వెడలుచు మాకు సంభవించిన యోగమే ఆనందరాజుగారికిని మూడు నెలలనాటికి సంభవించునుగాత మని శపియించి పెసిమిటి చితిపై నెక్కి దేహమును జాలించెనట! పతివ్రతాశాపము సామాన్యమా ?

ఈమె సహగమనము చేయుచుండగా ఆనందరాజుగారి భార్యలు పసుపు, కుంకుమమున్నగునవి పంపించిరనియు, మా దీదేశమేగాన మాకట్టి సాధనసంపత్తి గలదనియు, కొద్దిదినములలోనే మీకు నయితము సంభవించనైయున్న యట్టి యవస్థకు దూరదేశమందున్న మీరే సిద్ధముచేసికొని యుంచు

కొనుట మంచిదనియు హితోపదేశముచేసి, తమకు పంపించిన పసుపుకుంకుమలను తిరిగి పంపివేసిరని యొకగాథ చెప్పబడు చున్నది.

పిదప ఆనందరాజుగారు మఱిరెండుమాసములకు రాజమహేంద్రవరమున స్ఫోటకపడి కాలధర్మమునొందిరి. అప్పుడు వారి భార్యలిరువురునుగూడ సహగమన మొనరించిరి. పతివ్రతాశాపబలము సామాన్యముకాదు!

తదనంతర మనకాపల్లి, సత్యవరము జమీందారులగు రామభద్రపాయకరాయనింగారును, బుస్సీ బుచ్చన్నగారు నిరువురు నాలోచించి వత్సవాయ జగపతిరాజుగారియొక్క హింస తగిలియే యానందరాజుగారి ట్లల్పాయుష్కులైరనియు, నట్లే కానిచో నింతపని జరిగియుండ నేగదనియు, నికనైనను వారి సంస్థానమును నిలువబెట్టి ముందునకు దీసికొనివచ్చిననే గాని లేనియెడల నిట్టి దుర్ణయపుచావులే ప్రభువులకు సంభవించగలవనియు, నిదియునుంగాక జగపతిరాజుగారు చిన్నవారై యున్నప్పుడు విజయరామ గజపతిరాజుగారు తమ యింటనేయుంచి పెంచిరనియు, నందువలన నాసంస్థాన మొకటియు నీసంస్థానమొకటియు గాదనియు, దూరాలోచనజేసి విచారించి వత్సవాయవారి పక్షమువారితో జేరి తిమ్మజగపతి రాజుగారిని దీసికొనిపోయి పెద్దాపురసంస్థానమున కభిషిక్తులం జేసిరి.

ఇచ్చట విజయనగరమున, బుస్సీ బుచ్చన్నగారు జరిగినసంగతులన్నియు బొబ్బిలిలో మృతులైన పెదవిజయ రామరాజుగారిభార్యయు,నప్పటికధికారిణియునైన చంద్రయ్యా

య్యమ్మగారికి నివేదించిరి. పిదప నామెయు, కొంతతడవు పెద్దాపురపు వత్సవాయవారికి సంభవిల్లిన యిక్కట్టులను గుఱించియు గతించిన యానందరాజుగారి నడవడికను గుఱించియు విచారించి బుచ్చన్నగారు చేసినపనికి హర్షించిరి. తరువాత నామె మంత్రుల యాలోచనలమీద తాళ్ళపాలెమునన్న తమ సన్నిహితజ్ఞాతి యయిన పూసపాటి రామభద్రరాజుగారి ద్వితీయ భార్యాపుత్రుడైన పండ్రెండేండ్లయీడుగల వేంకటపతి రాజను చిన్నవానిని పెంచుకొని ఆ చిన్నవానిపేరు విజయరామరాజుగా మార్చి 'విజయనగర సంస్థానమున కాయనను పట్టాభిషిక్తుని జేసెను.

## —♦ నాలవ తిమ్మజగపతిరాజు మహారాజులుంగారు ♦—

[క్రీ. శ. ౧౭౬౦—౧౭౯౭]

ఈ మహారాజులుంగారు రాజ్యమునకు వచ్చునప్పటి కేడేండ్ల ప్రాయమువారు. తమ ప్రభువునందుగల భక్తివిశ్వాసములచే దమ సంస్థానమును, ప్రజలను భద్రముగ గాపాడుచు మంత్రి సేనానాయకులే రాజ్యతంత్రమును నడపుచుండిరి.

వీరు రాజ్య మేలుచుండగా హైదరాబాదు నుండి యప్పుడు నైజాములోనున్న నవాబుమీర్ నిజామల్లీఖానుడు (౧౭౬౧-౧౮౦౩) సేనాసమేతుడై వచ్చి గోదావరి కవతల రొయ్యూరు నున్న కొవ్వూరులో దిగియుండెను. అప్పుడాయనను సందర్శించుటకై బుర్రా బుచ్చన్నగారు మొదలగు మంత్రివర్గమును, మఱికొందరుద్యోగీయులును, పెంచుకొన్న విజయరామరాజు మహారాజుగారిని వెంటబెట్టుకొని చంద్రయ్యమ్మ

గారు కొప్పూరున కేతెంచిరి. వీరితోబాటుగా పెద్దాపురము నుండి మన తిమ్మరాజు మహారాజులుంగారును, పిఠాపురము నుండి రావు పెదమహీపతిరాయనింగారును వచ్చిరి. నవాబు నిజామల్లీఖానునకును విజయనగరపువారికిని శాకీసుకియున్న పేష్కషునుగుఱించి కొంత చర్చ జరిగినపిదప విజయనగరపు కోటను విజయరామరాజుగారికి ఖాయపఱచిరి. ఆ ప్రకారము గనే పిఠాపురపుకోటను పెదమహీపతిరాయనింగారికిని, పెద్దాపురపు కోటను తిమ్మనృపాలునకును స్థిరపఱచి వీరికి నౌబత్తులున్నగు ప్రాభవచిహ్నవిశేషముల నొసంగి వీరివలన గానుకలు మొదలగు నజరులను గ్రహించి వెడలిపోయిరి.

అటుపిమ్మట బుస్సీ బుచ్చన్నగారు మొదలగు నమాత్య పుంగవులతోను, చింతలపాటి నీలాద్రిరాజుగారు, సింహాద్రి రాజుగారు మొదలగు బంధుజనములతోడను, తక్కుంగల సేనానులతోను చంద్రయ్యవస్త్రగారు స్వదేశమునకు బైలు దేఱి వెళ్ళుచు మార్గమునసున్న పెద్దాపురమున తిమ్మజగ పతిరాజుగారిని జూడ దిగిరి. మన తిమ్మజగపతిరాజుగారును, తమయెడల నవ్యాజప్రేమ గనబఱచినందుకు వారియెడల మిగుల గృతజ్ఞులై గౌరవపూర్వకమైన విశ్వాసముతో వారికి విందులుజరిపి యాటపాటలచేతను, నృత్యగానాది వినోదముల చేతను సన్మానించిరి. వారును గొంతకాలనుచ్చటనుండి వీరు చేసిన సత్కారముల నందికొని, యెంతయు నలరి, మన మహారాజును శ్లాఘించి సుస్థిర రాజ్యవిభవులై వర్ధిల్లవలసినదని

యాశీర్వదించి యటనుండి తరలి యనతికాలముననే నిజరాజధానిం జేరికొనిరి.

శ్రీరామవిలాసమహాప్రబంధ నిర్మాణచాతురీధురీణుండును, మృదుసుధామధుర గద్యరచనా ప్రవీణుండును నగు నేనుగు లక్ష్మణ కవిపుంగవుం డీయనకాలముననే విలసిల్లినాడు. ఈ కవీంద్రుడు తిమ్మనృపాలున కాశ్రితుడై, యాస్థాన కవీశ్వరుడై యుండెను. ఈయన రామవిలాసమును రచియించి మొదట నీ మహారాజున కంకితమీయబోవగా సుగుణశీలుడగు నమ్మహారాజు తాము చిన్నవారమనియు దమవంశము వారిలో బెద్దలును, కాండ్రేగుల నివాసస్థులునగు వత్సవాయ గోపరాజుగారి కంకితమీయవలసినదనియు జెప్పి దమ సౌశీల్యమును, బంధుజనాభిమానమును, దురభిమానరాహిత్యమును వెల్లడించిరి. ఆహా! ప్రభువులనినవారేగదా!. ఆకారణముననే బుధజనరంజకమైన శ్రీరామవిలాసప్రబంధము తిమ్మజగపతిరాజుగారి కాశ్రితులగు లక్ష్మణకవిగారిచే రచియింపబడియు, కాండ్రేగులలోనున్న రాజబంధువు లగు శ్రీ వత్సవాయ గోపరాజుగారి కంకితము చేయబడెను.

మన తిమ్మజగపతి మహారాజుగారును, విజయనగర సంస్థానాధీశ్వరులగు విజయరామ గజపతిమహారాజుగారును సమకాలికులని యెఱుగనగును. వీరిరువురును ప్రాణమిత్రులు. అట్లగుట నొండొరులచ్చటనుండి యిచ్చటకును, నిచ్చటనుండి యచ్చటకును బోవుచుండెడివారు. ఏనుగు లక్ష్మణకవి

గారికి మన తిమ్మజగపతి మహారాజులుంగా రాశ్రయులైనట్లే అడిదము సూరకవిగారికి విజయరామగజపతిగారును నాశ్రయులైరి. పెద్దాపురమున తిమ్మజగపతి మహారాజుగారు రాజ్యమేలుచుండగా నొకప్పుడడిదము సూరకవి తన ప్రభువువెంట పెద్దాపురసంస్థానమునకు వచ్చి రాజులందఱును సభ చేసి కూర్చుండియుండగా—

ఉ. రాజు కళంకమూర్తిరతి రాజుశరీర విహీను డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతర సీమవర్తి వి
భ్రాజితపూసపాడ్విజయరామనృపాలుడె రాజుగాక యీ
రాజులురాజులే పెను తరాజులుగాక ధరాతలంబునన్,

అను పద్యమును సభలో నాసీనులయియున్న రాజుల వంక జూచుచు లేచి చదివెననియు, అందుమీాద నందలి కడపటి వాక్యము తమ్ముద్దేశించి పలికినట్లు భావించి సహజశూరశిఖామణులగు నాసభయందలి సామంతక్షత్రియపుంగవులందఱును కవిని కోపదృష్టితో జూచుచు లేవబోవగా నతడు జంకక పద్యార్థమును జెప్పి "యీరాజులనగా" పైచరణములందు జెప్పబడిన రాజు మొదలైనవారని స్పష్టపఱిచి రోషముడిపి, వారిని శాంతచిత్తులను జేసెననియు జెప్పుచున్నారు. ఇందలి సత్యాసత్యములు కాలపురుషులకే తెలియవలెను. కవులను గురించిన యిట్టిగాథ లాంధ్రప్రపంచకమున ననేకములు గలవు. వీరికిని శ్రీ విజయరామరాజుగారికిని బ్రాణ

స్నేహమని యావరకే నుడివి యుంటినికదా! వీరిరువురును విద్వాంసులై యుంట దమకున్న స్నేహబంధమున నొకరిపై నొకరు సంస్కృతశ్లోకముల జెప్పుకొనుచుండెడివారు. వారి గీర్వాణవైదుష్యము నెఱుంగ నుదాహరణార్థమువా రొండొరులపై రచియించుకొన్న శ్లోకములలో జెరియొక దాని నిట బొందుపఱుచు చున్నాడను.

శ్రీ విజయరామ గజపతిరాజుగారి మీద శ్రీతిమ్మజగపతిరాజుగారు చెప్పినది.

శ్లో. నాళీకభంగకృ దతీవ సదీనబంధు
ర్నక్షత్రపోనవసుధావిభవైకహేతుః ।
రాజా కి మిందు రపి నార్యభిమానహారి
రాజా పరం విజయరాఘవ సార్వభౌమః॥

శ్రీతిమ్మజగపతిరాజుగారి మీద శ్రీ విజయరామరాజుగారు చెప్పినది.

శ్లో. అంభోజం కలయన్ సదృక్షమననే సాహిత్యరీత్యాగృశో
ర్నాంధాతార మపారసంపది మహాభావే యశోరాశిషు
శత్రూణాంపురభంజనేతిచ గుణేకించోరగేంద్రంమతి
ప్రాగల్భే ప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః॥

ఆనంద గజపతిరాజుగారి మరణానంతరమున రావు కుమార పెదమహీపతిరాయనింగారు పిఠాపురమును రాజధానిగ జేసికొని తమ సంస్థానమును బాలించియున్నారు. ఈయన పాలించుచుండగా రాఘవపురమునకుబోయిన నీలాద్రి

రాయనింగారు పిఠాపురము తిరిగి వచ్చి మహీపతిరాయనిం గారి మంత్రాంగమున జేయిజేసికొనవలెనని ప్రయత్నించిరి. కాని యాయన చేసిన ప్రయత్నములు ఫలోన్ముఖములుకాక వ్యర్థములయ్యెను. అటుతరువాత పెదమహీపతిరాయనింగారు ఆయనను పిఠాపురమునుండి వెడలగొట్టిరి. పిదప గొంత కాలమున కనగా ౧౭౬౫ వ సంవత్సరమున కుమార వేంకటపతి రాయనింగారు విధివశులైన యనంతరమున నీలాద్రిరాయనిం గారు తిరిగివచ్చి సింహాసనము నాక్రమించుకొని ౧౭౭౧ వఱకు రాజ్యమేలిరి. ఈయన వెనుక వీరిమేన జ్యేష్ఠసోదరులగు పెద వేంకట మహీపతిరాయనింగారు రాజ్యమునకు వచ్చిరి. కాని యీయన కనిష్ఠసోదరులగు ముద్దు వేంకట మహీపతిరాయనిం గారు తమ యన్నగారిని సింహాసనభ్రష్టులం గావించి రాజ్య మును దన యధీనమును జేసికొనవలెనని మహాప్రయత్న ములు చేసెను. కాని యతని ప్రయత్నములు వ్యర్థములు. స్థితిగతు లిట్లుండగా రెండేండ్లు మాత్రము పరిపాలనము చేసి యకాలమునకు చిక్కుపడి పెద వేంకట మహీపతిరాయనింగారు కాలధర్మ మొందిరి. ఆయన వెనుక సింహాసనారోహణమునకై యీయన కుమారులైన కుమార వేంకట మహీపతిరాయనింగారికిని, యీయన పినతండ్రులైన బుచ్చివేంకట మహీపతి రాయనింగారికిని, ముద్దువేంకట మహీపతి రాయనింగారికిని కలహములు జనించెను.

ఈ సందర్భమున నొక్క విషయము చెప్పవలసి యున్నది. చనిపోయిన యిరువురు మువ్వురు పిఠాపుర ప్రభువు

లాంగ్లేయ దొరతనము (కంపెనీ) వారికి చెల్లించవలసిన పేష్కషు బాకీపడియుండగా, వారియందుండు మైత్ర్యభిమానములచే మన తిమ్మజగపతిమహారాజుగారు జామీనుదారులై వారు చెల్లించవలసిన పైకమునంతయు వారే చెల్లించిరి. కాని జామీనుదారులై వీరాంగ్లేయుల కొసంగినసొమ్ము యెంతకాలమునకును దిరిగి రాదయ్యెను. కాబట్టి పెదవేంకట మహీపతిరాయనింగారి యనంతరమున నీకలహసమయమున సంస్థాన మెట్లుపోయి యెటువచ్చునోయని తిమ్మజగపతిరాజుగారు తమసొమ్మును రాబట్టుకొనుటకై పిఠాపురముపరగణాను దమ వశముచేసికొని దానిని పరిపాలించుటకై రాజబంధువులైన వత్సవాయ తిరుపతిరాజుగారిని దమకు ప్రతినిధులుగ నియమించిరి. ఈవిధముగ ౧౭౭౭ వ సంవత్సరము మొదలు ౧౭౭౫ వఱకు పిఠాపురముపరగణా వత్సవాయివారి మారీబత్తున జరుగుచుండెను. ప్రాచీనమైన పిఠాపుర సంస్థానమంతయు పెద్దాపురప్రభువులగు శ్రీ వత్సవాయవారి స్వాధీనములోనున్న కాలమిదియే!

అప్పుడు బుచ్చివేంకట మహీపతిరాయనింగారు తమ భ్రాతృవ్య పుత్రుడైన కుమార వేంకట మహీపతిరాయనింగారిని, సోదరులగు ముద్దువేంకట మహీపతిరాయనింగారిని దేశబహిష్కృతులం గావించి వత్సవాయవారి కియ్యవలసిన పైకమును జెల్లించి, సంస్థానమును పునస్స్వాధీనము చేసికొని ౧౭౭౫ వ సంవత్సరము మొదలుకొని ౧౭౮౫ వఱకు దొరతనము చేసిరి.

ఈ తిమ్మరాజుగారు పరిపాలించుచుండు కాలముననే యనగా ౧౭౬౫ వ సంవత్సరమున గుంటూరుతక్క యుత్తర సర్కారులన్నియు నాంగ్లేయుల కియ్యబడినవి. గుంటూరు మాత్రము ౧౭౮౮ వ సంవత్సరమున నొసంగబడెను. ఇట్లింత వఱకు హైద్రాబాదు నైజాము స్వాధీనముననుండిన యుత్తర సర్కార్లు ఆంగ్లేయుల (కంపెనీవారి) వశమయ్యెను. తత్క్షణమే ఆంగ్లేయులు తమకు వశమైన దేశమును పరగణాలుగ విభజించి తమ పద్ధతులప్రకారము నూత్నపరిపాలనమును ప్రారంభించిరి.

*ఆంగ్లేయ పరిపాలనాప్రారంభదశలో నీ గోదావరి జిల్లా యీవరలో నైజామునకు ప్రతినిధిగ నీ దేశము నేలుచున్న హుస్సేన్ ఆలీఖానునకు కౌలునకీయబడెను. అతని కౌలుమరతు ౧౭౬౫ వ సంవత్సరముతో సరిపోయెను. అంతట నాంగ్లేయదొరతనమువారు తమ యాధీనమునవచ్చిన పరగణాలను కొంతమంది సభ్యులుగల యొక యాలోచన సభక్రిందను నొక ముఖ్యాధికారిక్రిందనుంచి పరిపాలించుచు వచ్చిరి. రాజమహేంద్రవరము, కొండపల్లి, ఏలూరుజిల్లాలు మచిలీపట్టణమున నున్న ముఖ్యాధికారిచేతను నతని యాలోచనసభచేతను పాలింపబడుచు వచ్చెను. శ్రీకాకుళమును, దత్ప్రాంతమును విశాఖపట్టణమునందలి ముఖ్యాధికారివశము చేయబడెను.

---

* Political survey of Northern Circars by James Grant.

ఫౌజులని పిలువబడు సేముఖ్యాధికారులు పరిపాలించుచుండుకాలమున జమీందారులయొక్కయు, రైతులయొక్కయు స్థితిగతు లెట్లున్నదియు నింతవఱకు నాకు దొరకిన యాధారముల ననుసరించి యిచ్చట గొంత వ్రాయుచున్నాడను.

* ఆ కాలమున నుత్తరసర్కారులందలి జమీందారులందఱు పేరునకు మాత్రము నైజామునకు సామంతులుగ నుండుచువచ్చినను నిజమునకు స్వతంత్ర ప్రభువులుగనె యుండిరి. వారు నైజామున కీయవలసినకప్పము నీయక యాతనిని చిక్కులు పెట్టుచుండెడివారు. వీరివద్దనుండి కప్పము పూర్తిగ గాకపోయినను గొంతవఱకయిన వసూలుచేయుటకు హైదరాబాదు నవాబులు బిరుదములు నిచ్చుచుండెడివారు. బాకీపడి, చెల్లించవలసియున్న కప్పములో నెవ్వరెంత యధికముగా నొసంగిన వారి కంత గొప్పబిరుదులు నైజామిచ్చుచుండెడివాడట! ఈరీతిని నవాబులు తమకు రావలసియున్న కప్పమును వసూలుచేసుకొనెడివారని తెలియుచున్నది. ఆ విధముగనే గాని తమ కప్పము రాబట్టుకొనుట కింకొక మార్గము వీరికి గాన్పింపలేదు కాబోలును! సైన్యములను పంపి జమీందారులను బెదరింపజూచినను వారిదండునుమించి జమీందారుల సైన్యములుండెనని చెప్పబడుచున్నది. అందువలన వారిని వశపరచుకొను నుపాయము నేదొకటి లేకుండ నుండెను.

---

*John Hedgsons report to lord william Bentic in 1805 A. D.

ఉత్తరసర్కారులు ౧౭౬౬వ సంవత్సరమున గౌరవనీయమైన తూర్పుఇండియా వర్తకసంఘమువారి స్వాధీనమునకు వచ్చునప్పటికి జమీందారు లెల్లరు హైదరాబాదు నైజాము లక్ష్యములేక చెల్లించవలసిన కప్పములను చెల్లించక సైన్యముల నభివృద్ధిచేసికొని, కోటలను కట్టుదిట్టముచేసికొని సర్వతంత్రస్వతంత్రప్రభువులై యుండిరి. మన ఆంగ్లేయులు బిరుదములిచ్చి ప్రజలను తమవశము చేసుకొను మార్గము యీ మహమ్మదీయులనుండి గ్రహించినదే!

* అప్పుడీజమీందారుల సైన్యము మూడు తరగతులుగ నుండెను. మొదటి తరగతివారు సామాన్య నౌకరులు; వారుచేసిన సేవకు ధనరూపమున జీతము లియ్యబడుచుండెను, ప్రతిక్షణమును జమీందారుని గనిపెట్టుకొనియుండి వారి యాజ్ఞను శిరసావహించుట వీరిధర్మము. రెండవతరగతివారు మొఖాసానౌఖరులు; వీరికి గొంతభూమి క్విట్ రెంటుమాత్రమే కట్టబడి యియ్యబడుచుండెడిది. వీరిధర్మము జీతములేకుండ రాజాజ్ఞకు లోబడి నౌఖరీ చేయుటయైయున్నది. మూడవ తరగతివారు సామంతప్రభువులని చెప్పవచ్చును. ఏదియేని యుద్ధము సంభవించినపుడుగాని వేటెట్టి సమయమునందుగాని తమవద్దనున్న పరివారముతో రాజాజ్ఞకు బద్ధులై నడుము కట్టుకొని పోరుటకాని, సంస్థానమును గాపాడుటగాని వీరి ధర్మమైయున్నది. మన పెద్దాపురసంస్థానమునకు సంబంధించినంతవఱకు కాక్రేనికోన మున్నగు క్షత్రియసామంతరాజ్యము

---

* Political survey of Northern circar by grant.

లును తోటపల్లి మున్నగు జమీందారీలును నీతరగతికి జెంది యున్నవి.

ఇట్లు సైన్యమును భద్రపరచుకొని కట్టుదిట్టముగనున్న జమీందారులు నైజామునకు లోబడియుండకపోవుట యాశ్చర్యముగాదు. స్వతంత్రప్రభువులువలె నున్న యీ జమీందారులను లోపరచుకొనుట మొట్టమొదట ఫ్రెంచివారికి వలెనే యాంగ్లేయులకు గూడ ప్రయాససాధ్యమయ్యెను. అదివర కీయుత్తరసర్కారులను వశము చేసికొని పాలించుచున్న ఫ్రెంచివారును, జమీందారులను కోఱలుదీసిన పాముల వలె జేయుటకు గాబోలు జమీందారీసైన్యమును తగ్గించివేయుచు వచ్చిరి. ఆ పథకమునే మన యాంగ్లేయులు కూడ పన్నుట యుచితమని హాడ్గసన్ దొరగారు తమ రిపోర్టునందు సలహా నిచ్చిరి.

అప్పటి జమీందారులిట్లు నైజామునకు దుస్సాధ్యులై యొకరి నొకరు మించవలెనని పాటుబడినటుల దెలియవచ్చుచున్నది. వారు ఆధిక్యత వెడలబుచ్చుటయందును, వైభవాతిశయమునందు నెక్కువ నౌకర్లను చాకర్లను నుపయోగించుటయందును, బ్రాహ్మణులకును, దమ్ము నాశ్రయించికొని యున్న యాశ్రితులకును, విరివిగా దానము లిచ్చుటయందును నొకరికొకరు మించవలెనని యహమహమికచే ధనమును వ్యయపరచుచు వచ్చిరట. "యథా రాజా తథా ప్రజా" యనునటుల వారికి దగినట్లుగనే తేరగ వచ్చుచున్నదని జెప్పి

మన బ్రాహ్మణోత్తములు "ఆ జమీందారుగా రింత గొప్ప దానము చేసి"రని యీ జమీందారిగారిని హెచ్చరించుచు "ఈయన యింతటి గొప్పవా"డని వారివద్ద పొగడుచు నాయా సంస్థానాధిపతులనుండి యపారధనమును, సగ్రహార ములనుగూడ బడయుచు వచ్చిరట. ఇట్టిగర్వములతో స్వతంత్రప్రభువులై మదగజేంద్రములవలె నున్న యీపరి పాలకులను వశపఱచుకొనుట కాంగ్లేయులకు గొంతకాలము పట్టెను. రాజనీతిచతురతగల ఆంగ్లేయులకిగ ఎంతో తోడ్పడి యుండును!

అనేకాఖండప్రయత్నములు చేసినమీదట కొంతకాల మగుసరికి జమీందారు లాంగ్లేయుల కడగిమడగి వినయ విధేయతలు చూపు స్థితికి వచ్చినను "జుమ్మా"యని పిలువ బడు కప్పమును మాత్రము కంపెనీవారికి సకాలమున చెల్లింప లేకపోవుచు వచ్చిరట.

అప్పటి జమీందారులు విద్యయు వివేకమును గలిగి యున్నను దమ్ము నాశ్రయించియున్న చాలమంది దుష్టుల ప్రోత్సాహమున భోగములకును, నింద్రియ సుఖములకును స్థితికి తగనంత వ్యయ మెక్కుడుగ జేయుచు క్రమక్రమముగ నాంగ్లేయులకు జెల్లింపవలసిన పైకమును బాకీపడుచు వచ్చి రని చెప్పబడుచున్నను యథార్థమునకు మన జమీందారులకు రాబడికంటె ఖర్చు విశేషమగుట తప్పని సరియైనదని తోచు చున్నది. ఆంగ్లేయులకు కావలసినదికూడ అదియేగదా!

విద్యకూడ సరియైన మార్గమున జెప్పబడుటలేదట. అప్పటి విద్యావిధానము నవీనముగ వచ్చిన యాంగ్లేయులకు రుచింపకపోవుట యొక వింతలోనిది కాదు. మన తిమ్మజగపతిరాజుగారి విద్యాభ్యాసమును గురించిన విచిత్రమైన గాథ యొకటి చెప్పబడుచున్నను నది విశ్వసనీయము కాదని యిట నుదహరింపలేదు. ఎంత గొప్ప నేరముచేసినను ఉపాధ్యాయుడు చూచియు జూడనట్లూరకుండవలసినదే. తన శిష్యుని మందలించుటకు దగిన స్వాతంత్ర్యము లేకుండెడిదట!

ఆ కాలమున బ్రాహ్మణులకే గాక పనిపాటలు చేయక సోమరిపోతులుగ నున్నవారికిని సహిత మేరాజెంత గొప్ప దానము చేయునో దానినిబట్టి యారాజు లంత యాధిక్యత నందుచుండెడివారస చెప్పబడుచున్నను "భిక్షాం దేహి"యను వానికి నుచితరీతిని సత్కరింపకపోవుట వారికి గొప్పలోటుగా గాన్పించుచుండెడిదని తోచుచున్నది.

పదునెనిమిదవ శతాబ్దము నందలి జమీందారులు తమకు వచ్చు సరియైనరాబడిని గమనింపక విశేషవ్యయము చేయుచు కంపెనీవారి కియ్యవలసిన జుమ్మా బాకీ పడుచు వచ్చినటుల గాన్పించుచున్నది.

జమీందారుల స్థితిగతులిట్లుండగా నప్పటి భూములను గురించియు, వారికి విధింపబడిన పన్నును గురించియు జమీందారులు రయితులనుండి పన్ను గైకొనిన రీతులను గురించియు నొక్కింత విచారించుదము.

భూమికి విధింపబడిన పన్ను, దాని ఫలసాయము యొక్క విలువ, వీనినిగుఱించిన సంగతియంతయు నొక్క లెక్కల పుస్తకమున వ్రాయబడియుండెడిది. ఆ లెక్కల పుస్తక మిప్పటి కరణముల లెక్కలపుస్తకములను బోలి యుండెడిదని చెప్పవచ్చును. దానికి కామిల్ అని పేరు. ఈ కామిల్‌లో నొక్కొక్క సంస్థానమునం దెన్నిగ్రామములుండు నదియు, భూమి పరిమిత మెంతయుండునదియు, నమోదు చేయబడి యుండెడిది. ఈ కామిల్‌పుస్తకముల ననుసరించియే దక్కను సుబాదారు డాయా సంస్థానముల పైనను, నాయా జిల్లాలపైనను కప్పము విధించుచుండెడివాడు. హిందూదేశ మున నైజాం ప్రభుత్వమునకు లోబడియున్న యన్ని ప్రదేశ ములయందును నీలెక్కలపుస్తకములు గానవచ్చుచుండెడివి. కాని యీ పుస్తకములంత సరియైనవిగా నుండెడివికావట! చాల కామిల్‌పుస్తకములలో భూములు అసలు పండుపంట కన్న నెక్కువ మొత్తము వ్రాయబడియుండుటకు కారణ మాయా జమిందారుల గొప్ప రాబడిని సూచించుటకై యుండెడిదని తోచుచున్నది. భూమి శిస్తులెక్కలను వ్రాయు టకు ప్రతిగ్రామమునకు మిరాసీదారులను పేర కరణముల నేర్పఱచు చుండెడివారట. ఈ మిరాసీదారి యుద్యోగము వంశపారంపర్యముగ వచ్చుచుండెడిది.

రివిన్యూ వసూలుచేయుటకు ముజుందారు లనబడు మరి యొక తరగతి యుద్యోగీయు లుండెడివారు. వీరు నైజామునే

నేర్పరుపబడినను సంస్థానాధీశుల కడగి మడగి యుండి వారి యాజ్ఞప్రకారము వర్తించుచుండుట విధమై యుండెడిది. వారి వినయవిధేయతల ననుసరించి జమీందారులే వారికి గొన్ని గ్రామముల నిచ్చియు, మాన్యములనిచ్చియు, వారి నాదరించు చుండెడివారు. అందులకు ప్రతిఫలముగ కాబోలును రాజునకు ధనముయొక్క యావశ్యకత కలిగినప్పుడు రయితుల వద్దనుండి, కరణము సాహాయ్యముతో తప్పక సొమ్ము వసూలుచేసి దివాణమున కంపుచుండెడివారు.

తమయొక్క వ్యయములకు లేకపోయినను, కంపెనీ వారు జుమ్మా నొసంగవలసిన దనిగాని, బాకీపడిన కప్పము నీయవలసినదని గాని నిర్బంధపఱచినను, శుభకార్యములు తటస్థించినపుడును రయితులువద్దనుండి మన జమీందారులు రాబోవు రెండుమూడుసంవత్సరముల శిస్తుసహితము ముందుగ వసూలు చేయుచుండెడివారట!

రాజ్యభారమునంతయు తమ దివానుపై వైచి తాము హాయిగా భోగపరాయణులై యుండుట వారి కలవాటు. దివాను లేమోసముచేసినను అమాయకు లగు మన ప్రభువు లకు దెలియుచుండెడిదికాదు. దాదాపుగా దివానులు స్వతంత్రులై యుండెడివారని చెప్పవచ్చును. తమ చిత్తమువచ్చిన రీతిని సంచరించుచు తాము కోరినధనము దివాను సర్దుబాటు చేసిన నంతియే చాలు నని వీరు తలంచుచుండెడి వారట. ఆ దివానులును నెన్నివిధముల రాజుదయ సంపాదింపవలెనో

అన్ని విధముల సంపాదించుకొనుచు, కొన్ని యెడల రాజును మోసము చేయుచుండెడివారని చెప్పబడుచున్నది. సిబ్బందికి ననుచరులకు నీయవలసిన జీతము లధికముగ బాకీబడుచుండుటచేత సైనికు లప్పుడు తిరుగబడుచుండెడువారు గాని తిరుగ త్వరలోనే వారికుచితరీతిని సత్కారము జరుగుచుండెడిది.

ఆకాలమున రైతులకు కొన్నిభూము లేకముగ గుత్త క్రింద నొక్కచోటనే నీయబడుచువచ్చెను. రాజబంధువులగు క్షత్రియులకును, ఇతర రాజపుత్రులకును నిట్టి మాన్యము లిచ్చుటచేతను వారివద్దనుండి పన్ను వసూలుచేయుట ప్రాణో పద్రవకరముగ నుండెడి దనుటలో వింత లేదు. రాజబంధువు లకు ఆదాయముకంటె వ్యయమధికము చేయక తప్పనిసరి యయ్యెడిది. పై విధమున బరిపాలన జరుగుచుండిన కాలమున నుత్తరసర్కారులు కంపెనీవారి యాధీనమాయెను. వీరుత్తర సర్కారులను స్వాధీనము చేసికొనకపూర్వము పెద్దాపుర సంస్థానమందలి కౌమిల్ ననుసరించిచూడ ౪౭౪ గ్రామ ములు పెద్దాపురసంస్థానమునందు గలవని తెలియుచున్నది. సర్కారు లాంగ్లేయుల వశమైనపిదప దొరకిన లెక్కలపుస్త కముల యాధారమున ౪౧౪ గ్రామము నున్నటులును, తరు వాత నేర్పడిన సంచారసంఘమువారి రిపోర్టువలన ౪౦౪ మాత్రమే యున్నటులును, యీ తిమ్మజగపతిమహారాజులుం గారి కుమారులగు రాయజగపతిరాజు మహారాజులుంగారి

కాలమున ౭౦౯ గ్రామములున్నట్లును తెలియవచ్చు చున్నది. ఇట్టి వ్యత్యాసమునకు కారణము, సింహాసనమునకు వచ్చిన ప్రతిరాజును దన పేరునగాని, తన దారాపుత్రాదుల పేరగాని కొన్ని నవీనగ్రామము లేర్పఱచుటయు, రెండు మూడుగ్రామము లొకటిగా జేయుటయు మున్నగు మార్పు లని తెలియుచున్నది.

పెద్దాపురసంస్థానములోని గ్రామములన్నియు పదు నెనిమిది పరగణాలుగ విభజింపబడి యుండెడివని కాగితా ధారమువలన తెలియవచ్చుచున్నది. పదునెనమిదవ శతాబ్ద మునకు పూర్వము పదునెనిమిది పరగణాలు పరగణాకొక బురుజుచొప్పున పదునెనిమిది బురుజులుగ నేర్పఱచి కోట విస్తీర్ణము చేయబడి కట్టబడినటుల తెలియగలదు. ఆ బురు జులపైని గుఱ్ఱపుబండి స్వేచ్ఛగా తిరుగు అవకాశముండు వెడల్పువుండెడిది!

ఒక్కొక్క పరగణా యొక్కొక్కతాలూకా వంటిది. అన్ని పరగణాలును సమానవైశాల్యమును గలిగియుండెడివి కావు. ఒక పరగణాయం దెక్కుడు గ్రామములును, వేరొక పరగణాయందు తక్కువ గ్రామములును, నుండెడివి. మన పెద్దాపురసంస్థానమునకదు మిక్కిలి పెద్దపరగణాయం దథువది గ్రామములవఱకునుండి, ౩౨౪౬౮ వరహాలవఱకు ననగా ౧౨౯౮౭౭౨ రూపాయీలవఱకు శిస్తు దివాణమునకు వసూ లగుచుండెడిది. మిక్కిలి చిన్న పరగణాయం దెనిమిది గ్రామ

ములవఱకు నుండి ౮౫౨౨ వరహాలు లేక ౩౪౦౮౮ రూపాయలు శిస్తు వచ్చుచుండెడిది.

ఉత్తరసర్కారులు కంపెనీవారి యధీనములోనికి రాక పూర్వము పెద్దాపురాధీశులు హైదరాబాదు నైజామునకు ప్రతిసంవత్సరమును ౧౧౪౨౮౩ వరహాలు లేక ౪౫౭౧౩౨ రూపాయలు పన్ను చెల్లించు చుండెడివారు. కంపెనీవారి యధీనమైన తరువాత ౧౧౮౬౮ వరహాలు లేక ౪౭౪౭౨ రూపాయలు జుమ్మా నిదివఱ కిచ్చు పన్నుకంటె నధికము చెల్లించవలసి వచ్చెడిది. మచిలీపట్టణమున వించిదొరగారు ముఖ్యాధికారిగా నున్న కాలమున ౫౦౩౮౭౬ రూపాయలును, వైట్‌హిల్ దొరగారి కాలమున ౫౧౮౧౭౬ రూపాయిలును జుమ్మా చెల్లించుచుండెడి దన్న నా కాలమున సంస్థాన మెంత యభివృద్ధిలో నున్నదో తెలియగలదు.

సంస్థాన మెంత యభివృద్ధిలో నున్నను, తరుచుగ పన్ను లధికము చేయబడుచుండినటుల గాన్పించుట చేతను, సంస్థానమువారికి వచ్చు నాదాయము వ్యయము... కొంచె మెచ్చుతగ్గుగా సమముగ నుండుటచేతను, జుమ్మా బాకీపడుట సంస్థానమువారికి మామూలాయెననిన నందు వింతలేదు. ఆ కారణముచేతనే సంస్థానమునందలి చిన్న యస్టేట్లు తరుచుగ వేలము వేయబడుట తటస్థించుచు వచ్చి క్రమముగ సంస్థానము క్షీణదశకు వచ్చుట తటస్థించినదని మనకు పై ఘుంకెలే వేనోళ్ళ చాటుచున్నవి. ఇట్టి స్థితిలో జుమ్మా

వసూలు చేయుట కంపెనీవారికి కష్టతరముగ నుండెనన్న నందు వింత యేమిగలదు? విశేషించి పన్ను యీయలేని స్థితిలో వున్న జమీందారునకు పన్ను అధికము చేయుచు వచ్చిన ఆంగ్లేయులరాజనీతి గమనింపదగినది!!

పై కారణములవలననే పరిపాలనయందున్న లోపములను దొలగించుటకును, రైతులకు క్షేమకరములైన యేర్పాటులు చేయుటకును, జమీందారులనుండి తగిన కప్పములను రాబట్టుకొనుటకును, వారి నిజమైన స్థితిగతులు విచారించుటకును చెన్నపురినున్న సెంటుజార్జికోటలోని యాలోచన సభయందలి ఐదుగురు సభ్యులు సంచారసంఘము (Committe of circute) గా నేర్పడవలసినదని ౧౭౭౫ వ సంవత్సరమున కోర్టు ఆఫ్ డైరక్టర్లు ఉత్తరువిచ్చిరి. దేశముయొక్క సరియైన ఫలనాయమును నిశ్చయపఱచి యుత్తరసర్కార్లయొక్క స్థితి, జనసంఖ్య, వచ్చు రాబడిమొత్తము, జమీందారులకుండు సిబ్బంది, వారికివచ్చు రాబడిమొదలగునవి విచారించి రిపోర్టు వ్రాయుట సంచారసంఘమువారి నిర్ణీతవిధియై యుండెను.

డైరక్టర్ల యాజ్ఞాప్రకారము సంచార సంఘమువారు తమపనిని ప్రారంభించిరి. కాని కొద్దికాలము లోనే వారు చేయుపని యప్పుడు చెన్నపురిగవర్నరుగానున్న సర్ థామస్ రంబోల్డుదొరగారిచేత నాటంకపరుపబడెను. ఆయనయే ౧౭౭౮ లో జమీందారులను చెన్నపట్టణమునకు బిలిపించి వారితో [illegible]ముగ దానే సెటిల్ మెంటు (గవర్న మెంటు

వారికి చెల్లింపవలసిన స్థిరమైనసొమ్ము, (ఏర్పాటు) చేయ నిశ్చయించుకొనెను. ఆప్రకారమే యిదివఱలో జమీందారులు చెల్లించుమొత్తము (మామూలు జమాబందీ) కంటె పైగా నూటికి $12\frac{1}{2}$ చొప్పున నెక్కువ పన్ను కట్టవలసినదను నేర్పాటు గావింపబడెను. ఇయ్యది జమీందారుల యిష్టము మీద జరిగిన యేర్పాటుకాదు. దొరతనమువారి నిర్బంధము మీద జరిగిన రాజీపద్ధతి అని తెలియుచున్నది!

ఈ సెటిల్మెంటు ననుసరించి ౧౭౭౯ సంవత్సరమున తిరిగి ౧౯-౩౯-౨ వరహాల జుమ్మా పెద్దాపుర సంస్థానమున కధికముగ గట్టబడెనని ౧౭౭౯ సంవత్సరమునాటి పెద్దాపురాధీశులు కంపెనీవారికి చెల్లించుచున్న పేష్కషు ౫౯-౦౯౯౯ రూపాయీలని తెలియవచ్చుచున్నది. ఇక సంస్థానాభివృద్ధి కావలెనన్న నెంతియో వ్యయ మొక్కమూరుగ తగ్గించవలెను. లేదా సంస్థానము దినదిన క్షీణదశకు రావలెను. మన ప్రభువు లధికముగ వ్యయము చేయగలరు గాని తగ్గింపగలిగినవారు కారు. ఆ కారణముచేతనే ప్రతిసంవత్సరము జుమ్మా బాకీపడుచుండెడివారు. బ్రిటిషు దొరతనమునకు కావలసిన కోరికయే అదికదా!

౧౭౮౦ వ సంవత్సరమున సర్. థామస్ రంబోల్డు దొరగారు గవర్నరుపదవినుండి విరమించిన పిదప సంచార సంఘము తిరిగి నియమింపబడెను. ఈ సంచారసంఘవిచారణ ఫలితమేమనగా రంబోల్డుదొరగారు జమీందారులకు నూటికి

12½ చొప్పున నధికముగా విధించినకప్పము స్థిరపఱుపబడెను. ౧౮౦౨లో దొరగారు చేసిన సెటిల్‌మెంటు తిరిగి మూడేండ్ల వఱకు ననువర్తించునట్లు పెంపు జేయబడెను. తిరిగి ౧౮౦౫వ సంవత్సరమున ఆలోచన సభాసభ్యులును ముఖ్యాధికారులును జమీందార్లకు వారికి వచ్చు మొత్తముబాబతీలో రెండు వంతులు పన్ను విధించిన యుక్తముగానుండునని తెలియ బఱచిరి. అటుపై రివిన్యూబోర్డువారును (ఈ రివిన్యూబోర్డు ౧౮౦౩ వ సంవత్సరమున స్థాపింపబడినది.) గవర్నమెంటు వారును నందుల కంగీకరించి యీపైని వచించిన ప్రకారము సెటిల్‌మెంటు చేసిరి. క్రమముగ జమీందారుల కోరలెటుల తీయబడినవో గమనించండి!

ఇట్లుండగా ౧౮౩౧ వ సంవత్సరమున గొప్ప కఱువు వచ్చెను. ఈకఱువు ౧౮౩౦ వ నవంబరు మొదలు ౧౮౩౨వ నవంబరు వఱకు ప్రజలను దన కాహారముగ జేసికొని దేశ వినాశము జేయుచు ప్రబలియుండెను. ఈ గొప్పకాటకము వలన ప్రజలుపొందిన కష్టములిన్నియని వర్ణింపనలవికాదు. ఈ రెండు సంవత్సరములలో దినుట కన్నములేక, యాకలి బాధ కోర్వజాలక మలమలమాడి ప్రాణముల విడిచినవా రైన నేమి, దేశమును వదలిపెట్టి పరదేశముల కన్నమునకై వెళ్ళినవారైననేమి, మొత్తము దేశమునందున్న ప్రజలలో నాలుగవవంతు జనముకలరని చెప్పబడుచున్నది. అప్పు డాంగ్లేయ దొరతనమువారు క్షామపీడితులను రక్షించి పోషిం

చుట్కై రు ౧౮౦౧౦౦ లు వ్యయపఱచిరి! పౌరవ్యయము మీాద బీదకుటుంబములందలి పిల్లల కన్నదానము చేయబడె నట!!

ఈ క్షామమునకు దోడుగ ౧౭౯౨ సంవత్సరమున గొప్ప యుప్పెనవచ్చెను. ఇక చెప్పవలసినదేమున్నది? ఈ కఱువు కాటకముల వలనను, యుప్పెన వలనను రైతులనుండి రావలసినపన్ను వసూలు కాకపోవుటయేగాక జమీాందారులకు విశేషనష్టము సంభవించెను. ఇట్టి తరుణముననే మన తిమ్మజగపతిరాజు మహారాజులుంగారు తమ పుత్రులగు శ్రీరాయ జగపతి మహారాజులుంగారికి వివాహము చేయవలసివచ్చెను. జుమ్మా యభివృద్ధియయినను, చాలపన్ను బాకీపడియున్నను, రైతులును, దేశమును కఱువు వలనను యుప్పెనవలనను బాధపడుచున్నను, శిస్తు వసూలుచేయుటకు వీలులేకపోయినను మన మహారాజు ౧౭౯౩ వ సంవత్సరమున ౨,౬౦,౦౦౦ రూపాయలు వ్యయముచేసి తమ కుమారులును, యువరాజుగారును నగు శ్రీరాజా రాయజగపతిరాజు మహారాజులుంగారి కతివైభవమున వివాహముచేసి, యెన్నో భూదానములుచేసి సాటిరాజులలో మేటులను కీర్తి సంపాదించిరి.. పైన వివరింపబడినరీతినే మన మహారాజువలెనే యుత్తరసర్కారులలోని యితరజమీాందారులును దేశ, కాల, పాత్రములను గమనింపక విశేషవ్యయము చేయుచు కంపెనీవారి కీయవలసిన జుమ్మాబాకీ పడుచువచ్చిరట! ఇందుకు దొరతనమువారి ప్రోత్సాహము లేదుకద!

ఈకఱవు యుప్పెనలకారణమున దొరతనమువారు జమీందారుల కచ్చటచ్చట నామమాత్రపు రిమీషను లిచ్చుచు, వచ్చిసను, వారు తమకు రావలసిన రాబడిని వసూలుచేయుటయందు మిక్కిలి ఖండితముగ నుండుచు క్రమముగ సంస్థానములను క్షీణదశకు తెచ్చిరని చెప్ప వచ్చును.

ఇట్లుండగా ముఖ్యాధికారులయొక్కయు నాలోచన సభవారియొక్కయు బరిపాలన మంత సంతృప్తికరమైనదిగా లేదని సంచారసంఘమువారు రిపోర్టు చేసినందున, నుత్తర సర్కార్లయందలి ముఖ్యాధికారులును, ఆలోచనసభలును దీసివేయబడి వారిస్థానమున ౧౭౯౪ వ సంవత్సరమున దేశ పరిపాలనకు కలెక్టరులు నియమింపబడిరి. ఒక్కొక్క కలె క్టరుయొక్క యధికారమునందున్న దేశమునకు కలెక్టరేట్ అని పేరు. అదియే యిప్పుడు జిల్లాయని పిలువబడుచున్నది. ఈ కలెక్టర్ల నేర్పరచిన పిదప దేశమంతయు కలెక్టరేట్లక్రింద విభాగింపబడెను. రాజమహేంద్రవరము, కాకినాడ, మొగ ల్తుఱ్ఱు ననునవి హెడ్ క్వాటర్లు (అధికారులుండు స్థలములు) గ మొట్టమొదట మూడు కలెక్టరేట్లు ఏర్పాటుచబడెను. కాని కొద్దికాలములోనే ప్రకృతపు గోదావరిజిల్లాలో జాల భాగము రాజమహేంద్రవరమునయందు కలెక్టరు యధికారము క్రింద నుంచబడి రాజమహేంద్రవరము జిల్లాయని పేరు పెట్టబడెను.

౧౭౯౧-౯౨ వ సంవత్సరములలో దేశమున కఱవు వచ్చెననియు, జమీందారు చెల్లించవలసిన కప్పము బాకీపడి యుండిరనియు పైని వ్రాసియుంటినికదా! ఈ క్షామపీడిత దేశస్థులగు జమీందార్లనుండి రావలసిన రాబడిని వసూలు చేసికొనుట గవర్నమెంటువారికి మిక్కిలి కష్టముగానుండెను. అందువలన నీనూతనముగ నేర్పఱుపబడిన యుద్యోగులు తమ నియమితవిధులను నెఱవేర్చునప్పుడు ప్రజలును, జమీం దారులును గూడ వారి నెదిరించుచువచ్చిరి. కాని పెద్దాపుర ము, పిఠాపురము, మున్నగు జమీందారులు దొరతనమువారి కంతశ్రమ కలుగజేయకయె తామిదివఱలో బాకీపడియున్న పైకమును జాలవఱకు జెల్లించివైచిరి. ఈ సంస్థానములలో గవర్నమెంటువారిపై దిరుగుబాటైనను లేక మొత్తము మీద శాంతి నిలచియున్నదనియే చెప్పనగును. ఒక్క మొగల్తుఱ్ఱు సంస్థానమునమాత్ర మిట్టి తిరుగుబాటును, కల హమును రేగెను. ఇట్టి చిన్నకలహమే ౧౭౯౮ వ సంవత్స రమున గూడ సంభవించెను. గాని యీ చిన్నకలహములను కొద్దిపాటి సైన్యములతోనే మిక్కిలి సులభముగ దొరతన మువా రణచివేయుచువచ్చిరి.

ఈ నూతనముగా వచ్చిన యాంగ్లేయ పరిపాలనా విధానము క్రమక్రమముగా జక్కపడుచున్న కాలమున నసగా క్రీ. శ. ౧౭౯౭ వ సంవత్సరమున విద్వద్బృందము నకును, కవీంద్రసంతానమునకును కల్పద్రుమంబై, యర్థిజన

పారిజాతమై స్వయముగా విద్వాంసుడై, కీర్తి విఖ్యాతులనంది విరాజిల్లిన శ్రీ తిమ్మజగపతి మహారాజుగారు స్వర్గస్థులైరి.

♦ శ్రీతిమ్మజగపతిమహారాజుగారికి వేటయన్న నత్యంత ప్రీతి. వీరొకప్పుడు గారు క్షుధార్తులై వేటనుండి తిరిగి వచ్చుచుండగా పరివారమంతయు వెనుకబడుటయు, వీరు ముందునకు సాగి వచ్చుటయు సంభవించెను. అంతట వీరచ్చటి కనతిదూరమున నున్న యొకపల్లె కరిగి పెండ్యాలవారను నింటి పేరుగల యొక భూసురాంగనను దనకేదైన భుజించ నొసంగవలసిన దని యడిగెను. ఆమెయు దాము వండుకున్న యంబలి తక్క తమ యింటను మఱేద్దియు లేదనియు, గావలసిన నదియే కొంచెము పోసెదననియు జెప్పెను. రాజును సంతుల కంగీకరించి దానిం గ్రహించెను. తరువాత ఆయన పెద్దాపురమును జేరి యాపుణ్యాంగనకు కబురు పంపించి యామెకు గ్రామము నగ్రహారముగ నిచ్చెను. ఈయగ్రహారమునకే "అంబటిపూడి" యని యిప్పటికిని వాడుక గలదు. ఇప్పుడు కూడ పైజెప్పిన పెండ్యాలవారీయగ్రహారము ననుభవించుచున్నారు. ఇట్టి వృత్తాంతము లెన్నియైన తెలుప వచ్చును.

ఈ తిమ్మరాజుగారు దానధర్మనిరతులై ప్రకృతమునం దమలాపురముతాలూకా యని పిలువబడు కోనసీమలో

---

♦ వీరి కిరువురు భార్యలు కలరు. వీరిరువురిలో నొకరు వల్లభరాజు వంశమున నుదయించిన అచ్యుతయ్యామ్మగారు, రెండవవారు పూలపల్లి దంతులూరి సూరపరాజుగారి కొమార్తె బంగారయ్యమ్మగారు.

వందలకొలది భూదానములు చేసి దాదాపుగా తాలూకా నంతయు ధారవోసినటుల తెలియవచ్చు చున్నది. ఇంక సంస్థానమునకు పేరుప్రతిష్ఠలేగాని వృద్ధియెక్కడ?

ఈ మహారాజొకనాడు మంత్రిదండ నాధాగ్రణుల తోను, ఆస్థానికవివరేణ్యులతోను, సామంతప్రభువులతోను కొలువు దీర్చియుండ ద్వారపాలకుడు వచ్చి "మహాప్రభో! ఏలినవారి దర్శనమునకు మాగాపు శరభకవిగారను నొక బ్రాహ్మణుడువచ్చి తాను వచ్చితినని దేవరవారితోనే మనవి చేయుమన్నారు. ఏమి సెల"వని విన్నవించెనట. అందులకు రాజును ఆస్థానకవీశ్వరులలో నొకరిని పంపి, సగౌరవముగ ఆయనను తీసికొనిరమ్మనిరట. ఈ కవిగారు వెళ్ళి ద్వారము దగ్గరనున్న శరభకవిగారి వేషమును జూచి ఆయన యగునా కాదాయని సందేహించి, చివరకు ఆయననేయని తెలుసుకొని రాజాజ్ఞ యయినదని విన్నవింప ఆ కవివతంసుడు లోనికి వచ్చెనట! మహారాజుదర్శనమునకు వచ్చిన యాకవిగారొక అంగవస్త్రము కట్టుకొని, చేతనొకచెంబు, భుజముమీద నొక గామంచా, చంకనొక తాటియాకు పుస్తకములకట్టమాత్రము కలిగియుండి, బీదబ్రాహ్మణవేషముతో నుండిరట. మహారాజీయనను చూచి "ఇతడా శరభకవి?" యనిరట. ఆ మాట మహారాజునోటనుండి వచ్చియు రాకమునుపే 'ఇతడా' యని తక్కువగౌరవమును దెలుపు శబ్దమున దన్ను సంబోధించెనను స్వాభిమానమునను, మహారాజు దయ సంపాదింప

వచ్చితినగదాయను నాశచేతను యీక్రింది పద్యము చదివె నట.

మ. ఇతఁడారంగదభంగసంగర చమూహేతిచ్ఛటాపావకో
ద్ధతకీలాకలభాయమానరిపు రాడ్డారాశ్రుధారానవీ
న తరంగిణ్యబలానమాగమసమానందత్ప యోధిస్తుతా
యతశౌర్యోజ్జ్వలుఁడైన వత్సవయతిమ్మక్ష్మావరుం డీతఁడా!

ఈపద్యము చదువుసరికి సభయంతియు నాశ్చర్యము నొంద, సరసుడగు నామహారాజు "మీకయిదుపుట్ల భూమి మీచిత్తమువచ్చినచోట యీనాముగనిచ్చితి"మని సెలవిచ్చి రని యొక గాథ చెప్పబడుచున్నది. భోజరాజంత రాజు డ కాళిదాసంత కవి యుండకపోడను సామెత యిట్టి మహారాజు కాలముననే సార్థకమయ్యెడి దనుట యతిశయోక్తి కాదు.

వీరి దానధర్మాదిగుణంబుల నుపలక్షించి మరియొక కవీశ్వరుడు వీరిమీాద జెప్పిన యొకచాటువు నిశ్చయముగ వీరి కీర్తిసి చాటుచుండుటచేత దాని నీక్రింద బొందుపఱిచి దానితో వీరి పాలనమును ముగించుచున్నాడను.

శా. తాజాగా సిరులుండి యోరికిడకం దామెక్క లేసట్టియా
ఫాజీలోభునిఁ బట్టి లోపలికి నీపాదోదకం బిచ్చినన్
తాజీమిచ్చును కర్ణుఁడాజనుల మేల్భ్రాతృత్వముంజూచి, శ్రీ
రాజా తిమ్మజగత్పతీ నరపతీ రక్షింప నీవేగతీ.

—♦ శ్రీ రాజా రాయజగపతిరాజు మహారాజులుంగారు ♦—

[క్రీ. శ. ౧౭౯౭-౧౮౦౪]

శ్రీ రాజా తిమ్మజగపతి మహారాజులుంగారి యనంతరమున ఆయన కొమారులైన శ్రీరాజా రాయజగపతిరాజుగారు రాజ్యమునకు వచ్చిరి. వీరు సింహాసనమునకు వచ్చునప్పటి కిరువది రెండేండ్లప్రాయమువారు. చాలస్ఫురద్రూపులు! ముప్వురు భార్యలభర్త!

వీరి కాలముననే ఇండియా గవర్నమెంటువారును కోర్టు ఆఫ్ డైరక్టర్లును, ౧౭౯౩ వ సంవత్సరమున బంగాళా రాజధానిలో నవలంబింపబడిన పర్మనెంటు సెటిల్‌మెంటు నిచ్చటకూడ ప్రవేశపెట్టవలసినదని మదరాసు గవర్నమెంటువారిని తొందరపఱచుచువచ్చిరి. ఈ పర్మనెంటు సెటిల్‌మెంటువలన రైతులనుండి జమీందారులు రాబట్టుకొనవలసిన సొమ్ము మొత్తమునుగురించియు, జమీందారులు గవర్నమెంటువారికి చెల్లించవలసిన కప్పమును గురించియు నట్టి చిక్కులు విడిపోగలవని యూహింపబడుచువచ్చెను. ఆప్రకారమే యీపర్మనెంటు సెటిల్‌మెంటు రాజమహేంద్రవరము జిల్లాలో ౧౮౦౨-౧౩ వ సంవత్సరములలో స్థిరపఱుపబడెను.

అప్పటికి దొరకిన లెక్కలను బట్టి కడచిన యెనిమిది మొదలు పదమూడు సంవత్సరములలో భూమిమీద వచ్చిన మొత్తపురాబడిలో సగటున రెండు వంతులు పేష్కషు చెల్లించు పద్ధతిమీద నప్పటికున్న జమీందారులకు వారి సంస్థానములు శాశ్వతానుభవముగా స్థిరపరుపబడెను.

ఈపైన వివరింపబడిన పర్మనెంటు సెటిల్‌మెంటు పెద్దాపురం సంస్థానమున శ్రీరాయజగపతి రాజు మహారాజులుంగారి కాలమున జరిగెను. ఈసెటిల్‌మెంటు ననుసరించి గోదావరిజిల్లాలోని చాలభాగము పెద్దాపుర సంస్థానము నందలిదై దాదాపుగా నేనులక్షల పేష్కషు చెల్లించుచుండెను. ఈ సెటిల్‌మెంటు ప్రకారము పిఠాపురము జమీందారీకి రెండున్నరలక్షలును, పోలవరము జమీందారీ కొకలక్షయును, కోటరామచంద్రపురము జమీందారీకి లక్షయిరువదియైదు వేలు పేష్కషు నిర్ణయింపబడెను.

ఈ రాయజగపతిరాజు మహారాజులుంగారివద్ద అనప్పిండి అమ్మన్నపంతులుగారు దివానుగానుండిరి. మహారాజులుంగారీయనకీ దివానుపదవి క్రీ. శ. ౧౮౦౦ సంవత్సరమున దయచేసిరి. శ్రీతిమ్మజగపతిరాజు మహారాజులుంగారి పరిపాలనయొక్క కడపటిభాగమందును, నీయమ్మన్నపంతులుగారికి పూర్వమును బాగన్నపంతులుగారున్ను, అమ్మన్నపంతులుగారి సోదరులగు విస్సన్నపంతులుగారును దివానులుగా నుండిరి. రాజులకు ధన మవసరమయినపుడు, రైతులొకవేళ నా ధనమును సర్దుబాటు చేయలేనిచో దానినిచ్చుటకు సమర్థతగలవారలే దివానుగ నియమింపబడుచు వచ్చిరని చెప్పబడుచున్నది.

రెండు సంవత్సరములు గడచిన పిదప ననగా ౧౮౦౨ సంవత్సరము డిశంబరు నెలలో మహారాజులుంగారీఅమ్మన్న

పంతులుగారిని యేకా[redacted]నన్ దివాను పదవినుండి తొల
గించిరని తెలియుచున్నది. సము[redacted]ముకు డబ్బు అందివ్వ
లేకపోవుటయే కారణము కాదుగదా ?

ఇట్లుండగా కోడుకొండ, దొడ్డిపట్ల పరగణాలు ౧౮౦౩ వ సంవత్సరమున అమ్మాకమునకు వచ్చెను. అయితే డబ్బు ఎక్కడిది? తిరుగా డబ్బు తెచ్చు దివాను కావలెను!

అపుడు మహారాజులుంగారు మొగలతుర్రు వెళ్ళి వేలముపాటలో నా రెండుపరగణాలను కొనగలిగిరట! ఆ కారణమున ౧౮౦౩ వ సంవత్సరము జూలయినుండి యీ రెండు పరగణాలు పెద్దాపురసంస్థానము క్రిందకు వచ్చెను. ఈ ధనము సమకూర్చగలిగిన దివానింకొకరు దొరకివుందురు!

మొగలతూరు వెళ్ళినపుడు కంపెనీవారు వీరిని తమ కిదివరకు బాకీపడియున్న జుమ్మానాను చెల్లించవలసినదని నొక్కి యడిగిరి. అపుడు రైతులనుండి ధనము వసూలగునట్లు గన్పింపదయ్యెను. ఈ సందిగ్ధస్థితిలో నేమిచేయుటకును దోచక శ్రీ మహారాజులుంగారు అమ్మన్నపంతులుగారికి తిరిగి దివాను పదవి నొసంగి ఆయననుండి కావలసిన ధనమును దీసికొనిరి.

సెటిల్మెంటు జరిగిన కొంతకాలమువఱకు దమ సంస్థానమును పరిపాలించి శ్రీరాజా రాయజగపతిరాజులుంగారు ౧౨౧౩ ఫసలీ గడవక పూర్వమే రక్తాక్షి సంవత్సరమునకు సరియయిన క్రీ. శ. ౧౮౦౪ వ సంవత్సరము ఏప్రియలు ౨౩ తేదీని పరమపదమునొందిరి. వీరు తమ మరణ

సమయమున అమ్మన్నపంతులుగారే తమ యనంతరమున గూడ బనిచేయుట కొరక వీలు వ్రాసిరి. వీరు చనిపోయిన పిదప ౧౨౧౮ ఫసలీ నాటికి పెద్దాపురసంస్థానపు డౌలు ౨,౩౧,౯౦౬ వరహాలు కోరుకొండ దొడ్డిపట్ల పరగణాల వలన కంపెనీవారికి జెల్లించుచుండిన జుమ్మా ౨౫ వేల వరహాలు.

కాని యీపైన జెప్పిన కోరుకొండ పరగణావలన రాబడి యంతగా రాకపోవుటయేగాక వచ్చునదియయిన సకాలమున రాకుండెను. ఎందువల్లననగా పన్ను వసూలు చేయు ముజుందార్లుగాని దేశపాండ్యాలుగాని ముతాదారులు గాని యాస్థిపరులుగ నుండెడివారు కారు. ఒకవేళ రయితుల వలన రాబడి సరిగా రాకపోయినను ముజుందార్లు మున్నగు రివిన్యూ యుద్యోగీయులు తామావచ్చు రాబడికి పూచీపడి దానిని ముందు తాము చెల్లించుటకు గూడ నసమర్థులుగ నుండుచువచ్చిరి. ఇంతియగాక వారి నొక్కొక్కప్పుడు నమ్ముటకుగూడ వీలులేకుండ వచ్చెడిది. వారి కపటవర్తనమువలన వారియందలి విశ్వాసము క్రమక్రమముగ క్షయమగుచు వచ్చెను.

వీరి ప్రవర్తనమిట్లుండ పర్వతప్రాంతముల మన్యములలో నివసించు కోయదొరలు కూడ తరుచుగ కోరుకొండ పరగణాకువచ్చి దోచుకొని పోవజొచ్చిరి. ఇట్టివారిలో నా కాలమున పండాదొర ప్రముఖుడుగానుండెను. అతడును మరి

కొండ ఇతరదొరలును రంపమన్యమునుండివచ్చి, పరగణాను గొల్లగొని మరలిపోవుచుండెడివారు. తగిన సమర్థులగునుద్యోగీయులు లేకపోవుటచేతను, కోరుకొండ పరగణా పెద్దాపురమునకు దూరముగ నుండుటచేతను నాపరగణా విశేషలాభకారి కాదయ్యెను. మేనేజరును, దివానును నగు అమ్మన్నపంతులుగారి లెక్కలవలన ౧౨౧౪ ఫసలీకి, అనగా ౧౮౦౪ సంవత్సరము జూలై ౧౨ తేదీ మొదలు ౧౮౧౫ సంవత్సరము జూలై ౧౩ తేదీకి నీక్రింది వివరములు తెలియవచ్చుచున్నవి.

౧౨౧౩ ఫసలీ ఆఖరుకు రొక్కము నిలవ ౪,౨౯౮ వరహాలు. ౧౨౧౫ ఫసలీలో జమీందారీలో వసూలైన మొత్తము ౧,౯౫,౯౨౮ వరహాలు.

ఈ ఫసలీలోనే బదులుచేసినది ౫౯,౯౧౬ వరహాలు, అనగా ఏబాపతువల్ల వచ్చినసొమ్మయిననేమి ౧౨౧౪ ఫసలీలో ౨,౬౦,౧౪౨ వరహాలు. అయినఖర్చులు ౫౨,౧౧౩ వరహాలు, తీర్చి వేసిన బాకీలు ౧౦,౩౬౪౫ వరహాలు. కంపెనీవారికి ౧౨౧౩ ఫసలీకి చెల్లించిన జుమ్మా ౨౬,౦౫౦ వరహాలు. ౧౨౧౨ ఫసలీకి చెల్లించిన ౭౬,౫౪౦ వరహాలు. ౧౨౧౪ ఫసలీ ఆఖరుకు రొక్కము నిలవ ౧౦౮౨ వరహాలు.

కంపెనీవారి యనుమతిలేనిదే రాజులిచ్చెడు భూదానములు ౧౭౮౯ సంవత్సరమునుండియు చెల్లవని తెలుపబడినదీకాలముననే! అట్టి కాలమిపుడు తిరుగావచ్చినది!!

తోటపల్లి యెస్టేటు, రంపచోడవరము మొదలగు పదునెనిమిది సర్దారీలును, ఇప్పటి గోదావరిజిల్లాలోని పిఠాపురం యెస్టేటు, రామచంద్రపురం జమీందారీయును దక్షకడమప్రదేశ మంతయును, కొవ్వూరు తాలూకాయును, యేలూరు తాలూకాలో కొంతభాగమును, ఎర్నగూడెము తాలూకాలో కొంతభాగమును, భీమవరము తాలూకాయును, తణుకుతాలూకాలో జాలభాగమును, నర్సాపురం తాలూకాలో మొగల్తుర్రు యెస్టేటు మినహాగా మిగిలిన భాగమును కలుపగా శ్రీరాయజగపతి రాజు మహారాజులుంగారు పరిపాలించిన పెద్దాపురసంస్థానముగా నేర్పడగలదని చెప్పబడుచున్నది. అనగా యిప్పటికి చాల సంస్థానము తరిగి పోయినదని చెప్పకతీరదు!

## రాణుల పరిపాలనము

[౧౮౦౪-౧౮౩౭]

## శ్రీలక్ష్మీనరసయ్యమ్మాదేవిగారు

చనిపోయిన శ్రీరాయజగపతి రాజు మహారాజులుంగారికి లక్ష్మీనరసయ్యమ్మగారనియు, బుచ్చిసీతయ్యమ్మగారనియు, బుచ్చిబంగారమ్మగారనియు ముగ్గురు భార్యలుకలరు. వారిలో ప్రథమభార్యయగు లక్ష్మీనరసయ్యమ్మగారికి ౧౭౯౯ సంవత్సరములో నొక కుమారుడు కలిగెను. వారికి శ్రీరాజాబుచ్చితిమ్మజగపతి రాజుగారని నామధేయమిడిరి. కాని, ఆయన

తలిదండ్రుల దురదృష్టవశమున నారుసంవత్సరములుమాత్రమే జీవించి, జననీజనకులు బాగుండగనే లోకాంతరగతు లైరి. ఆకారణమున శ్రీరాయజగపతిరాజు మహారాజులుంగారొక వీలుఁ వ్రాసిరి. ఆ వీలునసుసరించి శ్రీలక్ష్మీనరసయ్యమ్మగారు, గోపాలపురముననున్న తమ జ్ఞాతుల చిన్నవానిని దత్తత చేసికొని యాదత్తునిపేరు తిమ్మజగపతిరాజుగారని మార్చి వ్యవహారించుచు వచ్చిరి. ఈదత్తుడు మయినరయినందున సంస్థానమును కంపెనీవారు దమ సంరక్షణక్రిందకు తీసికొని మహారాజులుంగారును, లక్ష్మీనరసయ్యమ్మగారును దివానుగ నేర్పఱచిన అమ్మన్నపంతులుగారినే మేనేజరుగ నేర్పఱచి సంస్థానవ్యవహారములను చక్కబెట్టుచు వచ్చిరి.

ఆయనయు విశ్వాసముంచి మిగుల చతురతతో రాజ్యమును పాలించుచు నితరుల నేరిని లక్ష్యపెట్టక సంచరించుచుండెడివారు. ఆకారణమున రాజబంధువులకును, యీ దివానుగారికిని గిట్టకుండ నుండెడిది. రాజులేనిరాష్ట్రమున అధికారము చలాయించుటలోని నియోగిబ్రాహ్మణులు చాల నిపుణులుసుమా! పాఠకమహాశయా!

♦ భీమవరపుకోట నివాసులగు శ్రీరాజా వత్సవాయ జగన్నాథజగపతిరాజుగారికిని నీమంత్రిగారికిని చాల విరోధ

---

♦ వీరు కోట సంపాదించిన శ్రీ ముసలితిమ్మరాజాగారి ద్వితీయ పుత్రులగు శ్రీ గోపాలరాజాగారి కైదవ పురుషులయి యున్నారు. శాఖోపశాఖలుగ విరాజిల్లిన శ్రీ వత్సవాయవారి చరిత్ర అంతయు యీ గ్రంథమున నిముడ్చుట దుర్భరము!

ముగ నుండెడిదనియు నాకారణమున నీయన తొలగింపబడుటకు యత్నించుచు వచ్చిరనియు దెలియుచున్నది.

ఈ కాలమున నచ్చటచ్చట కలహములు రేగుచు వచ్చుటచేత వీని నణచుటకు, క్రొత్తగా కొంతసిబ్బంది యేర్పరుపబడుటయు, విశేషవ్యయమగుటయు తటస్థించినది.

ఈ సంస్థానమున కయిన వ్యయములు ౧౨౧౩ ఫసలీకి ౪౯,౯౪౭ వరహాలై యుండగా ౧౨౧౪ ఫసలీకి ౫౨,౨౧౩ వరహాలయ్యెనని తెలియుచున్నది. ఇందుకు పైనజెప్పినవే కారణములు కావు! సంస్థాన మొకరిచేతినుండి యింకొకరికి మారినపుడు ఖర్చులు పెరుగక మానవు!

శ్రీ రాయజగపతిరాజు మహారాజులుంగా రాయన తమ తల్లిగారగు పెదబంగారయ్యమ్మగారికి నెలకు ౩౦౦ వరహాలును, పెదభార్యగారికి నెలకు ౨౫౦ వరహాలును, రాబడివచ్చు గ్రామముల శిస్తుఖర్చులనిమిత్త మీయుగా కంపెనీవా రంగీకరించిరి. కాని యేకారణముననో పెదబంగారయ్యమ్మగారి కీయవలసినసొమ్ము యీ లక్ష్మనరసయ్యమ్మగారి కాలమునాటికి ౬౫౦౦ వరహాలు బాకీపడియుండెను. వీరును వీరి సవతిగారగు బుచ్చిసీతయ్యమ్మగారును స్నేహముగ నుండినటులను, వీరి రెండవసవతిగారగు బంగారయ్యమ్మగారికిని వీరికిని విరోధముగ నుండుచు వచ్చినటులును తెలియుచున్నది.

వీరి కాలమునగూడ గయితులనుండి సొమ్ము సరిగ వసూలు కాకపోవుటచేత ౧౮౦౫ సం॥ జూలై ౧౩ తేది నాటికి కంపెనీవారికి చెల్లించవలసిన ౫౯,౯౮౨ వరహాలు జమ్మా బాకీపడి యుండవలసి వచ్చెను. తరువాత నయినను యీ బాకీగాని పెదబంగారయ్యమ్మగారికీయవలసిన బాకీగాని చెల్లింపబడినట్లు నాకు దొరకిన యాధారములనుబట్టి తెలియుట లేదు.

♦ క్రీ. శ. ౧౮౧౮ సంవత్సరమున తమ స్వంత సెలవు నిమిత్తము నెలకు పెదబంగారయ్యమ్మగారికి ౩౦౦ వరహాలును లక్ష్మీనరసయ్యమ్మగారికి ౨౫౦ వరహాలును, బుచ్చి సీతయ్యమ్మగారికి ౧౦౦ వరహాలును, బుచ్చి బంగారయ్యమ్మగారికి ౨౦ వరహాలును సంస్థానాదాయమునుండి యిచ్చుచుండుటకు కంపెనీవారు స్థిరపఱచిరట! సొమ్ము సంస్థానమువారిది! పెత్తనము కంపెనీవారిది!! ఎంతన్యాయము?

వీరి కాలమునగూడ కొన్ని సంవత్సరములవఱకు వీరియత్తగారగు పెదబంగారయ్యమ్మగారు జీవించియున్నటుల తెలియవచ్చుచున్నది. ఈ సంస్థానమున వచ్చుటచ్చుట రేగిన కలహముల నణచివేయుట కుపయోగింపబడిన సైన్యము విషయమున నెక్కుడు వ్యయమయినదని గవర్నమెంటువారు ౧౮౦౯ సం॥న సంస్థానమునకు ౧౦,౨౧౬ వరహాలు రిమీషనునిచ్చిరి! ఆహా! ఎంత గొప్పదానము!!

♦ Report of W. wayte acting Secretary to the Govt in 1806 A. D.

సంస్థానముయొక్క రాజకీయస్థితి పై విధముగానున్న కాలమున శ్రీరాజా తిమ్మజగపతిరాయ నామాంకితులగు నా దత్తపుత్రులు తన్ను పెంచుకున్న తల్లిని విచారసాగరమున ముంచి విధివశులైరి. పాపమెంత దారుణము!

ఈ దత్తుని మరణానంతరమున శ్రీ లక్ష్మీనరసయ్యమ్మ గారు రెండవమారు దత్తుచేసికొనుటకు బ్రయత్నించగా నప్పు డున్న వత్సవాయవారందఱిలో దగ్గరవారసులైన భీమవరపు కోట శ్రీ రాజా వత్సవాయ జగన్నాథజగపతిరాజుగారు దత్తు తీసికొనుట యొక్క పర్యాయమే గాని రెండవమారుకూడదని వాదముచేసి దావా తెచ్చిరి. అప్పుడు రాజమహేంద్రవరము జిల్లాకోర్టునకు పైనిదగు బందరులోనున్న ప్రోవిన్షియల్ కోర్టు వారు వ్యాజ్యమును విచారించి రెండవపర్యాయము దత్తు తీసికొనుట శాస్త్రసమ్మతము కాదని నిర్ణయించిరి! అటు తరువాత పెద్దాపురసంస్థానమును పురుషులే కాని స్త్రీలు పరిపాలించకూడదనియు, మేము ముఖ్యవారసులము గనుక జమీందారీని మాపశము చేయవలసినదనియు పైనజెప్పిన శ్రీరాజా జగన్నాధజగపతిరాజుగారే తిరిగి వ్యాజ్యము తెచ్చిరి. ఆ వ్యాజ్యము నప్పటి రాజమహేంద్రవరము జిల్లాకలెక్టరు గారు విచారించి యుభయులకు రాజీనామా కుదిర్చిరి. ఆ రాజీ ప్రకారము శ్రీలక్ష్మీనరసయ్యమ్మాదేవిగారే తాముున్నంత కాలమును సంస్థానమును పాలించుటకును, ఆమె యనంత రమున మిగిలిన రాణు లిరువురును క్రమముగ పరిపాలించు టకును జమీందారీ యంతయు దావా తెచ్చిన శ్రీరాజా జగ

న్నాథగజగపతిరాజుగారికి వీరి అనంతరం చెందుటకును, అంత వఱకు పెద్దాపురపు జమీందారీలోనిదగు కొత్తాము యెస్టేటును వారిక్రింద వుండుటకు నిర్ణయింపబడినదని చెప్పదురు.

ఆ ప్రకారమే క్రీ. శ. ౧౮౧౦ వ సంవత్సరమున కొత్తాముయెస్టేటు పెద్దాపురపు జమీందారీనుండి చీలిపోయి శ్రీరాజా వత్సవాయ జగన్నాథగజగపతిరాజుగారి వశమైనది.

ఈ లక్ష్మీనరసయ్యమ్మా దేవిగారు పదివత్సరములు పరిపాలించి క్రీ. శ. ౧౮౧౨ సంవత్సరమున చనిపోయిరి.

—♦ శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారు ♦—

అటుతరువాత చనిపోయిన శ్రీరాయ జగపతిరాజుగారి ద్వితీయభార్య యయిన శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారు పరిపాలనాభారమును వహించిరి. కాని భీమవరపుకోట శ్రీరాజా వత్సవాయ జగన్నాథగజగపతిరాజుగారు తమకే యధికారము రావలెనని దావాచేసిరి. ఆదావా పర్యవసానము తేలువఱకు జమీందారీ గవర్నమెంటువారి స్వాధీనమున నుంచబడెను. ఈ దావా పదునాల్గువత్సరములు జరిగినపిదప కట్టకడపట శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారి పక్షమున దీర్పు చేయబడినది. ఆ తీర్పుప్రకార మప్పటికున్న రాణు లందఱియనంతరమున గాని వారసులగు శ్రీరాజా జగన్నాథ గజపతిరాజుగారికి జమీందారీ వశముకాగూడదనియు, జమీందారీ యమానీలో నున్న కాలమున నిలువయున్న సొమ్ము శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారి కొప్పగింపబడవలయు ననియు తీర్పు జరిగెను.

తీర్పు తమపక్షమైన సంవత్సరముననే యనగా ౧౮౯౭ లో శ్రీ బుచ్చిసీతయ్యమ్మాదేవిగారు సింహాసన మెక్కిరి. సింహాసనమెక్కిన యొకటిరెండు సంవత్సరములలో నామె పెద్దాపురమున నొక సత్రమును, కత్తిపూడిలో ఒకసత్రమును ఒంటిమామిడి గ్రామమున నొక సత్రమును స్థాపించి యందు నిర్విఘ్నముగ నన్నదానము జరుగుటకై సుమారు ౫౦ వేల రూపాయలు సాలీనా యాదాయముగల భూములనొసంగెను. ఈ మూడు సత్రములలోను వర్ణభేదములేక రెండుపూటల నన్నదానము చేయబడును. పెద్దాపురముననున్న సత్రమును, ఒంటిమామిడినుండి కత్తిపూడి సత్రములును జిల్లాబోర్డువారి స్వాధీనముననుండి పూజ్యారాలును నౌదార్యగుణశోభితయు నగు మానవతీశిరోమణి ♦శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారి శుభకీర్తిని జాటుచున్నవి.

తరువాత శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారు తమ భర్తగారి రంభతిభార్యలకు దత్తు తీసికొను నధికార మిచ్చిరను కారణమున దమ సతిగారైన శ్రీ లక్ష్మీనరసయ్యమ్మగారు చేసికొన్న స్వీకారము చెడిపోయినది గనుక తాము మరల

---

♦ డబ్బుతో సంస్థానము వచ్చుటచేక వీరే నవరత్నచింతామణి 150 వేలు ఖర్చుపెట్టి 300 తులములు తయారు చేయించి పెద్దగండరకు ఉచితముగ పంచిపెట్టగా శేషించినది వారి కుటుంబీకులగు హవేలీ రాజాలవద్ద కలదు. వీరి సంతతివారగు పెద్దాపురపు హవేలీ రాజకుటుంబములో నిప్పటికి నీ నవరత్నచింతామణి కలదు. వారు ప్రజోపయోగముగ విక్రయించుచున్నారు.

సొవరిన్నైన పెంచుకొనుట కభ్యంతర ముండకూడదని నిశ్చయించి పెంపకపు ప్రయత్నము చేయుచువచ్చి తుదకు కోట గంద్రేడు గ్రామముననున్న తమ మేనత్తమనుమలును శ్రీరాజా వత్సవాయ నరసరాజుగారి పౌత్రులును అదివఱకే ప్రభు కుటుంబీకులును నగు శ్రీరాజా వెంకటజగపతిరాజుగారిని దీసికొనివచ్చి తమ సంరక్షణలో నుంచుకొని పెంచుచువచ్చిరి.

పైని జెప్పిన శ్రీరాజా వత్సవాయ నరసరాజుగారు పెద్దాపురసంస్థానమును సంపాదించిన వత్సవాయ ముసలి తిమ్మరాజుగారి పెదతాతగారి సోదరుల కారవపురుషులును, జొంతమూరు నివాసస్థులునై యుండిరి. విజయనగరసంస్థానమున బహుశూరాగ్రేసరులని పేరువడిన శ్రీ దాట్ల వేంకటరాజు కుమ్ముందానుగారికి వీరల్లురగుటచేత నాసంబంధము ననుసరించి విశాఖపట్టణ మండలమున కరిగి విజయనగర సంస్థానములోని దగు కోటగంద్రేడు గ్రామమును నివాసముగా నేర్పఱచుకొని విజయనగర సంస్థానాధీశుల కనేక యుద్ధములలో సహాయులై యుండి వారివలన విశేషగౌరవ మర్యాదలనుపొంది కొన్ని యెస్టేట్లను గూడ వారినుండి గుత్తకు బుచ్చుకొని విశేషధనమునే కాక యశోధనమునుగూడ సముపార్జించిరి. వారు తుదకు శ్రీ విజయనగర పరిపాలకులైన చినవిజయరామ గజపతిరాజు మహారాజులుంగారికి సైన్యసమేతముగ సహాయులై వెళ్ళి పద్మనాభయుద్ధమున వారితోపాటు వీరస్వర్గము నొందిరి. శౌర్యధనులనిన వారేకదా

వీరాగ్రేసర సంజాతులు వీరే!!

శ్రీ బుచ్చిసీతయ్యమ్మా దేవిగారు తమ సంరక్షణమున బెరుగుచున్న యీ వీరాగ్రేసరవంశసంజాతులగు శ్రీరాజా వేంకటజగపతిరాజుగారిని యథాశాస్త్రీయముగా పెంపకము చేసికొని మహావైభవమున వివాహామాచరించి ఆయనయే సంస్థానమునకు ప్రభువులని ప్రకటించిరి.

ఈ సమాచారమును వీరిసతిగా రగు శ్రీ బుచ్చిబంగారయ్యమ్మా దేవిగారు తెలిసికొని పెద్దరాణిగారు దత్తుచేసికొనగా దానికి విఘాతమువచ్చినది గనుక తిరుగ పెంపకము చేసికొనగూడదనియు, పెంపకము రద్దుచేయువలసినదనియు ౧౮౩౭ సం॥ బందరుకోర్టులో ౮ నెంబరు దావా తెచ్చిరి. వెనుకటివలెనే బందరు ప్రోవిన్షియల్ కోర్టువారు సదరు దావాను విచారించి మరల దత్తము చేసికొనుట కధికారము లేదని తీర్మానించిరట! సంస్థానము నామరూపములు లేకుండ నశింపుటయేకదా పరిపాలకుల సంకల్పము!

అటుపిమ్మట శ్రీ బుచ్చిసీతయ్యమ్మగారు కొన్ని యినాం భూములు మున్నగునవి దత్తపుత్రునకిచ్చి యింకను విశేషోపకారముచేయు తలంపున నుండగా నామె యాకస్మికముగా విషూచిజాడ్యమువలన క్రీ. శ. ౧౮౩౯ వ సంవత్సరమున గాలధర్మము నొందిరి. దైవవిధి నెవ్వరుతప్పింపగలరు?

—♦ గ్రంథకర్తవంశము ♦—

దత్తులగు శ్రీరాజా వేంకటజగపతిరాజుగారును దమకొసంగబడిన యినాంభూములవలన గాలక్షేపము చేయుచు దమ పెంపుడుతల్లిగారివద్దనే యుండెడివారు. ఇట్లుండగా కళత్ర

వియోగము సంభవించినందున ఆయన మరల కాకినాడ తాలూకా కోలంక వాసులును, శ్రీ వైష్ణవభక్తాగ్రేసరులును, విద్వాంసులును నగు శ్రీదంతులూరి జగన్నాథరాజుగారి జ్యేష్ఠ పుత్రికయైన శ్రీ వేంకటరమణయ్యమ్మగారిని బరిణయమైరి. భవ్యులగు నీ యిరువురు దంపతులకు శ్రీరాజా సీతారామ జగపతిరాజుగారు, శ్రీరాజా రాయజగపతిరాజుగారు నను నిరువురు పుత్రులు కలిగిరి. పుత్రలాభముపొందిన కొంత కాలమునకు శ్రీరాజా వేంకటజగపతిరాజుగారు స్వర్గస్థులైరి.

శ్రీరాజా వేంకటజగపతిరాజుగారి ప్రథమపుత్రులైన శ్రీరాజా సీతారామజగపతిరాజుగారికి వేంకటజగపతిరాజుగారు అప్పలనరసింహజగపతిరాజుగారు, వేంకటసూర్యనారాయణజగపతిరాజుగారు నను ముగ్గురు కొమారులు కలరు. వారిలో ప్రథములైన వేంకటజగపతిరాజుగారికి సంతానము లేదయ్యెను. కాని ప్యారీకంపెనీతో వర్తకవ్యాపారములు చేసిరి. ఇట్లుండగనే వారు లోకాంతరగతులైరి. ద్వితీయులైన అప్పలనరసింహజగపతిరాజుగారికి చిన సీతారామజగపతిరాజను నొక కుమారుడు కలడు. తృతీయులగు వేంకటసూర్య నారాయణ జగపతిరాజుగారికి వరాహ వేంకటనారాయణ జగపతిరాజు పెదసీతారామజగపతిరాజు, సీతారామజగపతి రాజు, అచ్యుతరామజగపతిరాజునను కుమారులు గలరు. వీరిలో పెదసీతారామజగపతిరాజు ప్రథమ కళత్రపుత్రుడు.

శ్రీరాజా వేంకటజగపతిరాజుగారి ద్వితీయపుత్రులును, ధర్మశాస్త్ర, వైద్యశాస్త్ర, నీతిశాస్త్ర పారంగతులని ప్రసిద్ధిగాంచిన వారును, గీర్వాణపండితులును నగు శ్రీరాజా

రాయజగపతిరాజుగారే నాపితామహులు. వీరే యీగ్రంథ కృతిభర్తలు. వీరు చిరకాలము జిల్లాబోర్డు మెంబరుగానుండి దేశక్షేమమునకై పాటుపడి గవర్నమెంటువారికి శ్లాఘాపాత్రులైరి. శ్రీ విక్టోరియామహారాజ్ఞిగారి జూబిలీ (పంచాశద్వర్షప్రాయోత్సవము) సందర్భమున ౧౮౮౭ వ సంవత్సరము సెప్టెంబరు ౭ వ తేదీని శ్రీ కలకత్తాగవర్నరు జనరలుగారు వీరికొక బిరుదుపట్టా నిచ్చిరి. శ్రీరామభక్తులగు వీరికి దైవభక్తియు, పురాణశ్రవణాసక్తియు విశేషముగ గలదు. వైఖానసధర్మచంద్రికాది బహుగ్రంథకర్తలు! వీరు మహారెనుబదేండ్లప్రాయము గలవారై దైవారాధనపరులై కీర్తిశేషులైరి. పండితులయ్యు స్వయముగ గ్రంథకర్తశ్రేణిలో చేరలేదు!

శ్రీ రాజా రాయజగపతిరాజుగారికి వేంకటజగన్నాథజగపతిరాజుగారు, నారాయణజగపతిరాజుగారు, వరాహనరసింహజగపతిరాజుగారు, లక్ష్మీనరసింహజగపతిరాజుగారు నను నలుగురు తనయులు కలిగిరి. వీరిలో మొదటివారును నాల్గవవారును సంతానహీనులయియే కాలధర్మమునొందిరి. రెండవవారైన శ్రీ రాజా నారాయణజగపతిరాజుగారు పూజ్యులగు నా జనకులు. ఆధునికాంధ్రక్షత్రియలోకము వీరి పరోపకారపారీణత నెఱింగియున్నది. వీరికి రాయజగపతివర్మ, వేంకటజగన్నాథజగపతిరాజు, వేంకటకృష్ణజగపతిరాజు నను మువ్వురు తనయులున్నారు. వారిలో నగు రాయజగపతివర్మ ప్రథమకళత్రపుత్రుడను. మిగిలిన యిరువురును ద్వితీయకళత్రసంజాతులు. తృతీయులును నా పినతండ్రులును నగు వరాహ

నరసింహజగపతి రాజుగారికి చినరాయజగపతిరాజు, వేంకట రామజగపతిరాజు, వేంకటనారాయణ జగపతిరాజు నను ముగ్గురు కుమారులున్నారు. కుటుంబవృద్ధియైన కొలదియు ఆదాయము భిన్నాభిన్నమై పోకమానదుకదా!

—♦ శ్రీ బుచ్చిబంగారయ్యమ్మాదేవిగారు ♦—

శ్రీ బుచ్చిసీతయ్యమ్మాదేవిగారి యనంతరమున శ్రీరాజా రాయజగపతిరాజుగారి తృతీయభార్యయగు శ్రీబుచ్చిబంగారయ్యమ్మాదేవిగారు రాజ్యభారము వహించిరి. వీరు సిద్ధాంతం నివాసులగు నల్లపరాజు శ్రీహరిరాజుగారి తోబుట్టువులును శ్రీ మొగలతూరు సంస్థానప్రభువులగు కలిదిండివారికి సమీపబంధువులునై యున్నారు. వీరికిని వీరిసవతిగారగు లక్ష్మీనరసయ్యమ్మాదేవిగారికిని తఱచు వివాదముగనుండెడి దనియు, కంపెనీవారట్టి వివాదములను పరిష్కరించుచుండెడి వారనియు తెలియుచున్నది. వీరు రెండేండ్లుమాత్రము రాజ్యముచేసి స్వర్గస్థులైరి. వీరికాలమున తెలిసికొనదగిన విశేషము లేవియు గానరావు. కాని మొత్తముమీద యీ ముగ్గురు స్త్రీల పరిపాలన అనుకూలముగ జరిగినదని చెప్పవచ్చును.

శ్రీ బుచ్చిబంగారయ్యమ్మాదేవిగారు పరమపదించిన పిదప ౧౮౩౭ వ సంవత్సరమున శ్రీరాజా వత్సవాయ జగన్నాథజగపతిరాజుగారి జ్యేష్ఠపుత్రులైన శ్రీరాజా సూర్యనారాయణజగపతి రాజుగారు తమపక్షమైన కడపటి దావా తీర్పుప్రకార మధికారమునకు వచ్చి కొద్దిసంవత్సరములు మాత్రమే రాజ్యమేలిరి. వీరు భీమవరపుకోట నివాసులును వారి పినతండ్రిగారును నగు శ్రీరాజా వెంకటపతిరాజుగారి

కుమాళ్లు అగు శ్రీరాజా సూర్యనారాయణరాజుగారు, శ్రీరాజా జోగిజగన్నాథజగపతిరాజుగారు, శ్రీరాజా వెంకటకృష్ణజగపతి రాజుగార్లను విశేషభూవసతుల నేర్పఱచియున్నారు. వీరికి శ్రీరాజా వెంకటజగన్నాధ జగపతిరాజుగారనియు, శ్రీరాజా వెంకటసింహాద్రి జగపతిరాజుగా రనియు నిద్దరుకుమారులు గలిగిరి. సంతానము గల్గిన కొంతకాలమునకు వీరు స్వర్గస్థులైరి. తరువాత పెద్దకుమారులగు శ్రీరాజా వెంకటజగన్నాధ జగపతిరాజుగారు కొత్తాం జమీందారులైరి. వీరికి పుత్రసంతతి కలిగినది. గాని బాల్యముననే తల్లిదండ్రులను దుఃఖసాగరమున ముంచి యాబాలుడు చనిపోయెను. తరువాత వీరు స్వల్పకాలముమాత్రము పరిపాలించి చనిపోయిరి.

వీరి సోదరులగు శ్రీరాజా వెంకటసింహాద్రి జగపతి రాజుగారు మఱల కొత్తాం యెస్టేటు జమీందారులైరి.. వీ రధికారమునకు వచ్చిన కొద్దికాలమునకు పుత్రసంతానము కలిగినది. గాని యాబాలు డయిదు సంవత్సరములు మాత్రము జీవించి, తల్లిదండ్రులను బంధువులను దుఃఖసాగరమునముంచి స్వర్గస్థుడాయెను.

శ్రీరాజా వెంకటసింహాద్రి జగపతిరాజుగారు బహు ధర్మాత్ములై దేశాభిమానము కలిగి తమ రైతుల ననేక విధముల సంరక్షించుచు వచ్చిరి. వీరు తమ రాజధానియగు తునిగ్రామమున నొక హయ్యరుపాఠశాలయును, (High School) అన్ని వర్ణములవారికి నన్నదానముచేయుట కొక మహాసత్రము ను, నేర్పరచుటయేగాక, రాజధాని గ్రామమునందును, వేరు కొన్ని యితరగ్రామములందును, పెద్దపెద్ద మామిడితోటలు

మున్నగునవి యేర్పఱచిరి. అరణ్యములయందు పక్షుల నివాస మునిమిత్తము పెద్దపెద్ద స్తంభములను కట్టించియు, వాటికి నీటివసతు లేర్పరచియు, తునిగ్రామమందు కర్మాగారములను స్థాపించి దేశీయుల స్వతంత్రజీవనాభివృద్ధికి పురికొల్పియు విశేషకీర్తిని సంపాదించిరి. వీరొక ముద్రాక్షరశాల నేర్పఱచి యనేక గ్రంథములను ముద్రింపించియు, స్వయముగా గ్రంథములను రచియించియు భాషాభివృద్ధికి తోడ్పడిరి. ఆయుర్వే దౌషధములను విరివిగా చేయించి ప్రతివారికిని నుచితముగ నిచ్చుచు ప్రజల యారోగ్యాభివృద్ధికి తోడ్పడినవారైరి.

వీరి తండ్రిగారు పెద్దాపురసంస్థానమును పరిపాలించు చున్నకాలమున ననగా క్రీ. శ. ౧౮౩౮ వ సంవత్సరమున దేశమున క్షామ మతిశయించియుండుటచేత దొరతనము వారికి చెల్లించవలసిన పేష్కషు విస్తారము బాకీపడియుండెను. ఆకారణమున పెద్దాపురం జమీందారీలోని శేషించిన చాల గ్రామములు ముఠాలు వేలము వేయబడి యన్యాధీనము లయ్యెను.

దొరతనమువారి కీయవలసిన పేష్కషు విశేషముగ నుండుట, తఱచు బాకీపడుట, చిన్నచిన్న యెస్టేట్లు తఱచు వేలము వేయబడుట యీమొదలగు చిక్కులీ సంస్థానమున కెన్నోమారులు తటస్థించుటచేత నీబాధలు పడుటకంటె దొరతనమువారికే యీ శేషించిన సంస్థానము నిచ్చివేయు నెడల నుత్తమముగా నుండుననియు, నందువలన దమకు కౌజీకూడా విశేషముగ రాగలదనియు నెంచి శ్రీరాజా సూర్యనారాయణ జగపతిరాజుగారు తమకు పూర్వమునుంచి

జరుగుచున్న కొత్తాం యెస్టేటును మాత్రముంచుకొని, మిగిలిన సంస్థానమును గవర్నమెంటువారి యధీనముచేసిరి. పిమ్మట కొంతకాలమున కనగా ౧౮౭౩ వ సంవత్సరమున జ్ఞాతులలో వచ్చిన కలహముల వలనను, కోటభూమి, లోగిళ్ళు దొర తనమువారివశము చేయబడి పిమ్మట హావేలీలో పెద్దాపుర మునగల మాకుటుంబమున కీయబడెను.

శ్రీరాజా సూర్యనారాయణజగపతిరాజుగారు సంస్థానమును నిచ్చివేసినందులకై గవర్నమెంటువారు వీరికి నెల కారువందల రూప్యములచొప్పున తౌజీ నిచ్చుచువచ్చిరి. ఆ తౌజీలో అయిదువందల రూపాయలు వారు పుచ్చుకొని, నూరురూపాయీలు వీరిసోదరులును, పెద్దాపురగ్రామములో నివాసముగా నున్నవారును నగు శ్రీరాజా తిమ్మజగపతిరాజుగారి కిచ్చుచువచ్చిరి.

ఈ తిమ్మజగపతిరాజుగారికి శ్రీరాజా వెంకటజోగీ జగన్నాథజగపతిరాజుగారు, శ్రీరాజా వెంకటనారాయణ జగపతిరాజుగారు, శ్రీరాజా వెంకటసూర్యనారాయణ జగపతిరాజుగారు నను ముగ్గురు కుమారులు గలిగిరి. వీరిలో జ్యేష్ఠులగు శ్రీరాజా వెంకటజోగీ జగన్నాథజగపతిరాజుగారికి శ్రీరాజా వెంకటసుదర్శన తిమ్మజగపతిరాజుగా రను పుత్రులును, శ్రీరాజా వెంకటజోగీజగన్నాథ జగపతిరాజుగారను పౌత్రులును గలరు. రెండవవారగు శ్రీరాజా వెంకటనారాయణ జగపతిరాజుగారికి శ్రీరాజా వెంకటసూర్యనారాయణ జగపతి

రాజుగారను పుత్రులును, శ్రీరాజా వరాహ వెంకటనారాయణ జగపతిరాజుగారను పౌత్రులును గలరు. వీరికిపుడు యిరువురు కుమారులు కలిగినారు. బాల్యులగు వీరి పేర్లు జ్ఞాపకమునకు రాలేదు!

పై వారిలో శ్రీరాజా తిమ్మజగపతిరాజుగారు, వారి జ్యేష్ఠపుత్రులగు శ్రీరాజా వెంకటజోగిజగన్నాథ జగపతిరాజుగారును చనిపోయిన పిమ్మట శ్రీరాజా వేంకటనారాయణ జగపతిరాజుగారును, వారి సోదరులును, తమకు తౌజీ నాపు చేయుట న్యాయముకాదని సకారణముగ దొరతనమువారికి దెలియచేసినందున, వీరుభయుల జీవితకాలమువరకును చెరి యేబదిరూప్యములును నిచ్చుచువచ్చి పిమ్మట తౌజీనిచ్చుట మానివేసిరి. ఇటీవల గోదావరి జిల్లాకలెక్టరు వి. ఏ. బ్రాడీ దొరవారు శ్రీరాజా బుచ్చిసీతయ్యమ్మాదేవిగారి పౌత్రులైన శ్రీరాజా రాయజగపతిరాజుగారికి జిరాయితీ రేటుకట్టి కోట భూమినంతయు స్వాధీనముచేసియున్నారు. ప్రస్తుత మాభూమి వీరి స్వాధీనములోనే యున్నది. ఈ భూమిని వీరి కుటుంబము వారును వీరి సోదరకుటుంబమువారును అభేదముగ అనుభవించుచున్నారు.

## —♦ గమనింపదగినవిషయము ♦—

౧. పెద్దాపురముకోటయొక్క పదునెనిమిది బురుజుల లోను, తాళ్ళబురుజు, హనుమంతబురుజు, తోకబురుజు, మున్నగునవి సుప్రసిద్ధములు. బురుజు ఒక పరగణాకు గుర్తుగ ౧౮ పరగణాలుండెడివి!

౨. కోటలో నిప్పటికిని మదీనాపాచ్చాగారి గోరీయని యొక గోరీకలదు. అది పది యడుగులపొడవుకలదు. ఈగోరీ కోటకట్టుటకు బూర్వమునుండియు నుండెనని పెద్దలందురు. ఈ పెద్దాపురసంస్థానప్రభువులందఱు మహమ్మదీయుల పండుగ దినములలో విశేషోత్సవములు చేయుచుండెడివారు. ఈగోరీ విషయమై కొందఱు మహమ్మదీయపండితులను కనుగొన, నీస్థలమొక పుణ్యక్షేత్రముగా దమ గ్రంథముల జెప్పబడినట్లు చెప్పుదురు. అందులకు దార్కాణముగా నేటేట బరప్రదేశ ములనుండి కొంతమంది యాత్రికులు వచ్చి మ్రొక్కుబడులు చెల్లించుచుందురు. ఇయ్యది ప్రాచీనకాలపు హిందూమహమ్మ దీయ మైత్రికి తార్కాణమని చెప్పవచ్చును. ఇంత మహమ్మ దీయమైత్రి గల సంస్థానము వేరొకటి యీ రాజధానిలో గాన్పింపదు!

3. కొత్తాం యెస్టేటు కీర్తిశేషులైన శ్రీరాజా వేంకట సింహాద్రి జగపతిరాజుగారి పెద్దభార్యాగారగు శ్రీరాజా వత్స వాయ వేంకటసుభద్రయ్యమ్మా జగపతిదేవిగారి వలన బరి పాలింపబడినది. వీరు పరిపాలనమునకు వచ్చిన సంవత్సరము ననే వీరి రాజధానియగు తునిగ్రామమునం దొక వేదశాస్త్ర పాఠశాలను స్థాపించి, విద్యార్థులకు భోజనవసతు లేర్పఱచి ప్రసిద్ధిగాంచిరి. తమ భర్తగారేర్పఱచిన పురాణపాఠశాలాభి వృద్ధికి పాటుబడుచు, బీదలగు విద్యార్థులకు భోజనవసతు లేర్పఱచి కొందఱి కుచిత విద్యనిప్పించుచు, దేశాభివృద్ధికి

పాటుబడిన సంగతి యాంధ్రలోక మెఱింగియున్నది. వీరధి కారమునకు వచ్చినపిమ్మట బంధుకోటి కనేక భూవసతులను, నగదువసతులను, నేర్పాటుచేయుచు ఆధునికాంధ్రక్షత్రియ లోకమున మిగుల ప్రఖ్యాతినందినారు. వీరి పురాణ శ్రవణా సక్తియు, దైవారాధనాతత్పరతయు, నెల్లరకు విశదమే. వైష్ణవభక్తాగ్రేసరి యగు నీసాధ్వి కోలంక నివాసస్థులును, భాగవతాగ్రేసరులును, బంధుజనాభిమానులును, నా పితా మహులకు మేనమామగారును, నగు శ్రీ దంతులూరి అచ్యుత రామరాజుగారికి ప్రథమపుత్రిక. వీరి సంస్థానమున సుమారు నలుబది గ్రామములు కలవు. కొంచెము హెచ్చుతగ్గుగా ముప్పదివేల రూప్యముల పేష్కషు గవర్నమెంటువారికి చెల్లింపబడుచున్నది. వీరు కీర్తిశేషులైనపిదప దత్తులగు శ్రీరాజా సూర్యనారాయణ జగపతిరాజుగారికి సంస్థానము నప్పజెప్పిరి. వీరిపుడు మిక్కిలి జాగరూకతతో పాలించు చున్నారు.

౮. వత్సవాయి యను యింటిపేరు గ్రామనామము నుండి యీ వంశీయులకు వచ్చినదనుటలోను సాగివారు వత్స వాయివారైరనుటలో నెక్కువ గౌరవములేదని నా గ్రంథ విమర్శకులగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగా రెంతయో వ్రాసిరి. కాని అంతమాత్రమున గౌరవలోపము రాజాలదనియు, దేశచరిత్రమునుబట్టి చూచినయెడల తప్పక గ్రామనామమే వంశనామమయినటులను సాగివారిలోనివారే వత్సవాయివారయినటులును తోచుచున్నది. ఈ వత్సవాయి

వారినుండి బుద్ధిరాజువారుకూడ బయలుదేరి యిప్పుడు బుద్ధి రాజువారైరని తెలిపినంతమాత్రమున గౌరవలోప మున్న దనుట న్యాయముకాదు!

౫. ఈ సంస్థానమును సంపాదించిన శ్రీ ముసలితిమ్మ జగపతిరాజుగారినిగూర్చియు, వారు సంపాదించిన విధానమును గూర్చియు నా గ్రంథవిమర్శకులు చేసిన వ్యాఖ్యానము నాధు నిక చరిత్రకారు లెవ్వరును విశ్వసింపజాలరని చెప్పిన జాలును.

౬. పెద్దాపుర రాజకుటుంబముయొక్క సనాతనవంశ వృత్తము శాసనములమూలమున మనకు స్పష్టముగ గాన్పించు చున్నపుడు ప్రబంధకవుల వ్రాతలను మాత్రము నాధారముగ తీసికొనుట అంగీకరింపదగినదికాదు. కనుక దుర్జయుడు మూల పురుషుడనుటలో విమర్శకులు వ్రాసిన యధిక్షేపము ప్రాచీన చరిత్రమును తెలిసికొనగోరువారికి గమనింపదగినదిగ గాన్పిం చుటలేదు. ప్రస్తుతము వీరి విమర్శగ్రంథ మెక్కడను గాన్పిం చదు. శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారుకూడ స్వర్గస్థులైనారు!

ఒకప్పుడు మహదైశ్వర్య భోగముల ననుభవించి, నిస్తుల శౌర్యపరాక్రమాదులకును, అపార పాండిత్యసంపద లకును ఆంధ్రకవీంద్రపోషణమునకును ప్రఖ్యాతికెక్కి సుమారు ౩ శతాబ్దములు రాజచంద్రులచేత బరిపాలింపబడి విరాజిల్లిన శ్రీ పెద్దాపురసంస్థానచరిత్ర మిప్పటికి ముగింపునకు వచ్చినది. కన్నులార జూతమన్న నీ సంస్థానచరిత్రముమాత్రము గాన్పిం చుచున్నది. గాని సంస్థాన మూరును పేరును లేక కాలగర్భ

మున మటుమాయమైనది. ఆహా! ఎప్పుడెటుపోయి యెటు నచ్చునదియు మన కుత్తరక్షణమున నేమి సంభవించునదియు గూడ నొక్కింత యైనను దెలియరాదుగదా! భగవద్విలాస మెంతటి కవిపుంగవులకైన వర్ణనా దుస్సాధ్యము! భగవ దుద్దేశ్యములు దుర్గ్రాహ్యములు!!

పూర్వ మొకప్పుడీ పెద్దాపురసంస్థానములోననే యుని సోరార వచించుట కిప్పటికిని కొత్తాం, వీరవరము, కిర్లంపూడి, జగ్గంపేట, గొల్లప్రోలు, పలివెల, గోపాలపురము, కపిలేశ్వరపురము, మున్నగు యెస్టేట్లుమాత్రము నిలచియున్నవి. ఎన్ని సంస్థానములు పోయినను, యెన్ని రాజ్యములు నశించినను వాని చరిత్రలు మాత్రము చిరస్థాయిగా నుండగలవు. వీటిని చదివి పాఠకులు నేర్చుకొనదగినవిశేష మొకటిగలదు. మనకు వచ్చు సిరిసంపదలు బుద్బుదప్రాయములనియు, శతాబ్దముల కొలది పరిపాలించిన సామ్రాజ్యములే నశించిపోవుచుండ మన ఐశ్వర్యము స్థిరమైనదికాదని, గుర్తెరిగి, దేశ పురోభివృద్ధికి, దేశ స్వాతంత్ర్యసిద్ధికి మన ఐశ్వర్యము వినియోగపడిన యెడల మన జీవితము సార్థకము కాగలదని గమనించుట ధర్మమైయున్నది. ఇట్టి ధర్మమును పాటించు మహానీయుల జీవితములే వారు కీర్తిశేషులైనను ప్రపంచమున ఆదర్శనీయములై యుండి చిరస్థాయిగ నుండగలవు.

సమాప్తము

## మహాపురుషుల జీవిత చరిత్రము

మూడవ భాగము : 1 గాజు లక్ష్మీనర్సుశెట్టి, 2 పి.వి. రంగనాథశాస్త్రి, 3 మహారాజా సర్ రామవర్మ, 4 రాజా సర్ మాధవరావు, 5 సర్ తిరువళ్ళూరు ముత్తుస్వామి అయ్యర్, 6 తండాళం గోపాలరావు, 7 పూడి రంగనాథ మొదలియార్, 8 సెట్టిపాణియం పిరపల్లి రంగాచార్యులు, 9 రామస్వామి మొదలియార్, 10 సర్ కె. శేషాద్రి అయ్యర్, 11 వెంబాకం రామయ్యంగారు. వీరు చెన్న రాష్ట్రీమందలి మహాపురుషులు. వెల రు 1—8—0

## జవహర్ యిందిరకు లేఖలు

రచయిత : భారత ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ

అనువాదకులు : కే. వి. దేశికాచార్య, బి. నరసింగరావుగార్లు

ఈ గ్రంథము చూడడానికి చిన్నదైనా విషయ వివరణలో ఉద్గ్రంథమే యనాలి. జాతీయ స్వాతంత్ర్య రథమునకు ప్రధాన సారథియై విదేశీయ కౌరవుల నుగ్గాడి నేడు నలువదికోట్ల భారతీయుల బంగరుహారముల నందుకొనుచు దేశీయపాలనాభారమును మోయు జవహర్ పండితుడు 1928 వేసవిలో పదేండ్లవయసుగల తన గారాబుపట్టి యిందిరాదేవి హిమాలయమునందలి మసూరీలో నుండ తాను క్రిందనుండి యామెకు వ్రాసిన లేఖలు. ఇందు ప్రపంచము వివిధజాతుల యేకకుటుంబమని నిర్ణయించు 30 లేఖలు కలవు. భూమి యెట్లేర్పడినది, ఆదిమమానవు లెవరు, నాగరికత యెట్టిది, వివిధజాతు లెర్పడ్డాయి, భాషా సంబంధాలు—తెగలు—ప్రాచీనకాలపు మహానగరాలు, ఈజిప్టు చీనాదేశములతో భారతీయుల సముద్రయాత్రలు, నౌకావాణిజ్యము, మన రామాయణ మహాభారతాలు—ఇంకా రుచికరమైన వెన్నో ఉన్నాయి. వెల 1—0—0

---

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.